Tanjore Saraswathi Mahal Series No. 8.

# MAIRAVANACHARITRA

BY

**KACHANA,**

A DWIPADA KAVYA.

CRITICALLY EDITED

BY

**SRI V. SUNDARA SARMA,**
*Pandit, Saraswathi Mahal Library, Tanjore.*

AND

**SRI A. MAHADEVA SASTRI.**
*Pandit, Saraswathi Mahal Library, Tanjore.*

ఆంధ్ర [illegible]
[illegible]
[illegible]

PUBLISHED

BY

**SRI S. GOPALAN B.A.B.L.,**
*Honorary Secretary for the Administrative committee, T.M.S.S.M. Library, Tanjore.*

1950.

తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణము - 8

# మైరావణచరిత్ర.

(కాచనవిరచితము)


పరిష్కర్తలు

శ్రీ వి. సుందరశర్మ,

పండితుడు, సరస్వతీమహల్ గ్రంథాలయము,

తంజావూరు.

శ్రీ అ. మహాదేవశాస్త్రి,

పండితుడు, సరస్వతీమహల్ గ్రంథాలయము,

తంజావూరు.



ప్రకాశకులు

శ్రీ S. గోపాలన్, B.A., B.L.,

గౌరవకార్యదర్శి, సరస్వతీమహల్ గ్రంథాలయము,

తంజావూరు.

1950.

# PREFACE

The Saraswathi Mahal Library in Tanjore represents the synthesis of the three different cultural influences, the Tamilian Cholas, who ruled till the middle of the 13th century, the Telugu Nayaks who ruled till the middle of the 17th century and the Maharashtra Kings who ruled till the middle of the 19th century. This great cultural fusion was finally enriched still further by the impact of influences from the West, and of the East India Company. The contribution of Telugu Nayak Kings of Tanjore to what may be called the Tanjore school of Telugu literature, is tremendous and still remains to be fully assessed by the world of Telugu scholarship. Many of the Nayak Kings were themselves remarkable writers and it was but natural that they encouraged talented authors and also enriched their archives with rare Telugu works of their times. This is part of the explanation for the remarkable collection in the Telugu section of the Saraswathi Mahal, the other part consisting in the fact that Telugu continued to hold an honoured place under the Maharashtra Kings of Tanjore, some of whom like Raja Shahaji were reputed Telugu scholars and made frequent additions to the Telugu collection.

The following are some of the important Telugu works which we are publishing in a series.

1, Ramayanamu by KATTA VARADARAJU,

2. Taladasapranapradeepika by GOVINDA KAVI.

3. Andhra Kamandakamu by ZAKKARAJU VENKATA KAVI.

4. Ragunathanayakaabhyudayamu by VIJAYARAGHAVA NAYAKA.

5. Rajagopalavilasamu by KALAYA,

6. Kusalavopakhyanamu by RAMANARYA,

7. Dwipada Bhagavatamu (10th Skandha by) MADIKI SINGANARYA.

8. Vipranarayanacharita by VIJAYARAGHAVA NAYAKA.

9. Ragunathaabhyudayamu by VIJAYARAGHAVA NAYAKA.

Mairavanacharita, published in the following pages, was selected for publication mainly for its remarkable popular appeal. It is a folksong about Rama and Lakshmana being carried away at the instance of Ravana by Mairavana from Lanka to Patala Lanka, and their final rescue by Hanuman. We see from another text of the work available in the Madras Government Oriental Manscripts Library, that KACHANA is the author of this work. He calls himself a master of the Dwipada metre. His father is stated to be MALLADI AYYALANNA and his mother LAKKAMAMBA. His place of residence is mentioned as CHELALURU in the northern parts of Srigiri, which can be indentified with Tirupati. The author has dedicated his work to CHENNAKRISHNA, the patron deity of his place.

The whole story is told in simple and homely couplets. Our Pandits Sri A. Mahadeva Sastri and Sri V. Sundara Sarma, who are both able Telugu scholars, have edited the work with critical notes and have also contributed an introduction which, we hope will be found valuable. They have removed scriptoral errors in the manuscripts as far as they could, except where they felt that correction would be of doubtful advantage. We hope that the Telugu speaking public will welcome this work as a valuable recorded version

of a well-known story, which holds our attention as much as the oriental epics.

We are grateful to the Government of Madras for the timely financial assistance given to us to preserve and bring to light the remarkable treaures in the Saraswati Mahal. We are especially grateful to our Premier Sri P. S. Kumaraswami Raja and our Education Minister Sri K. Madhava Menon for the keen interest they evince in our Library.

Tanjore,
1950.

S. GOPALAN,
*Honorary Secretary.*

# తొలిపలుకు.

## —: కవి ప్రశంస :—

ఈ మైరావణ చరిత్రను రచించిన కవి "కాచన" యని యూహించుట కాధారమున్నది. తంజావూరు సరస్వతీమహాల్ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందలి తాటాకులప్రతియందు గ్రంథకర్త పేరు కానరాదు. కాని మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారప్రతియందు కవి నామధేయము కన్పడుచున్నది. ఈ రెండుప్రతులును నేకకర్తృకములా లేక భిన్న కర్తృకములాయని చర్చించి చూచినప్పుడు పాఠభేదములున్నను, కథాసంవిధానపద్ధతి, శైలియున్నగు వానినిఁబట్టి చూడ నేకకర్తృకములనియే నిర్ధరింపవీలగుచున్నది. ఈ పరిష్కరణము శుద్ధముగా తంజావూరు ప్రతిననుసరించి యున్నది. కవినామవంశప్రతిపాదకములగు పద్యములను మద్రాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారపు ప్రతిననుసరించి యథామాతృకముగానిందు పొందుపరుచుచున్నాము.

" కౌశికగోత్రమున ఘనతకునెక్కి
సర్వ విద్యలయందుఁ జతురుఁడై యున్న
నలరంగ మల్లాది యయ్యలన్నకును
రమణిరత్నంబైన లక్కమాంబకును.
నేకసుతుఁడు ధీరుఁడు వంశావ్వయుండు
శ్రీహరికులజుఁడు చిట్టయసోదరుఁడు
కరమర్థితోడుత కాచనను వాఁడ"

కౌశిక గోత్రోద్భవుఁడగు మల్లాది అయ్యలన్నకును లక్కాంబకును జన్మించిన వాఁడు "కాచన" యని దీనినిఁబట్టి తెలియుచున్నది.

" ......శ్రీగిరి నుత్తరంబునను ,
విలసితమైన యాచెలులూరిలోన
అవతారమైయున్నయట్టి యహోత్సు

నాకులదైవంబు నన్నేలుసామి
హరిచెన్నకృష్ణుని నాత్మలోఁదలఁచి ''

శ్రీగిరికి (తిరుపతియో లేక శ్రీశైలమో) ఉత్తర భాగమందు ''చెలులూరను'' గ్రామమందున్న తన యిష్టదైవమగు ''హరిచెన్నకృష్ణు''నికి కవి తన గ్రంథమునంకితము చేసినట్లు తెలియుచున్నది. అదే ప్రతియందు మరియొకచోట

'' అరయ వాఢేవల్లి హర్మ్యభాగమున
దివ్యావతారమై తిరముగానున్న
అలలోకారాధ్యనాగమ వినుత
చెన్నకృష్ణుని నాదు చిత్తంబులోన ''

అని కన్పడుచున్న వాక్యములఁబట్టి కూడ వాఢేవల్లికి చెలులూరను నామాంతరమేమో? దీనిని నిర్ధరించు పట్లనాధారములు దొరకనందున దీనినిర్ణయభారము సహృదయులగు పండితులపై వదలి వేయుచున్నాము.

## —: కథాభాగము :—

రెండుప్రతులలోను కథాభాగము వసిష్ఠులవారు శ్రీరామచంద్రునకు వక్కాణించునట్లున్నది. కథాసంవిధానముకూడ సమానమే.

శ్రీసీతారాములపట్టాభిషేకసమయమున రామరావణయుద్ధములో పేరెన్నికగన్న వీరులకు సమ్మానము జరుగును. హనుమంతుని పరాక్రమమును శ్రీరాముఁడు గొనియాడును. వసిష్ఠులవారు మధ్యనందుకొని—''ఓ రామా! నీకు హనుమంతుఁడు చేసినయుపకారములకు మేరయేలేదు. మైరావణుని మాయానిద్రయందున్ననీకును దెలియని యొక గొప్ప సాహసకార్యమును హనుమంతుఁడు చేసియున్నాఁడు. ఆకథను చెప్పెదను వినుము.'' అని యీ విధముగా వసిష్ఠులవారు మైరావణ చరిత్రమును శ్రీరాములవారికి చెప్పునట్లుగా కథనడచుచున్నది. మైరావణుఁడు తన మిత్రుఁడగు రావణప్రేరితుఁడై రామలక్ష్మణులను హనుమంతుని వాలంపు కోటనుండి మాయావిభీషణవేషధారియై హనుమంతుని మోసగించి యపహరించుట; హనుమంతుఁడు తన తప్పు తెలిసికొన్నవాఁడై పాతాళలంకకు వెళ్ళి మైరావణుని వధించి శ్రీరామలక్ష్మణులను విడిపించి తీసుకొనివచ్చుట మొదలుగాగల సంభవములిందు వర్ణితములు.

## —: శైలి :—

మాకు దొరికిన రెండు మాతృకలను పరిశీలించి చూడ, ఈరెంటికిని మూలాధారమగు నొకమాతృకయుండెననుట స్పష్టమగుచున్నది. ఆప్రధాన మాతృకను జూచి వ్రాసిన వ్రాయసకాండ్రసృష్టియే యీరెండుప్రతులని కంఠోక్తిగా చెప్పవగును. తప్పులను దొర్లించుటలో నిద్దఱు వ్రాయసకాండ్రును సరిసమానులై యున్నను, తంజావూరుప్రతి కొంతశుద్ధమై యొప్పుచున్నది. సంగ్రహింపవలసిన చోట వివరించియు, వివరింపవలసినచోట సంగ్రహించియు కథయొక్క నడక యొగుడుదిగుడుగానున్నను, మొత్తముమీఁద సౌలభ్యము, రమ్యత గ్రంథమునందు చాలభాగములందు కననగును. రచన సంస్కృతసమాస భూయిష్ఠమై ప్రబంధ శైలిననుసరించక పోయినను, వాడుకమాటలతో సొంపారి యున్నది.

మంజరీద్విపదకు చెప్పబడిన ఛందోనియమములను కవి పాటించి యుండ లేదు. కొన్ని చోట్ల ప్రాసయతులను కవి యుపయోగించియున్నాఁడు. "తుద మొదళ్లనుఁ గంటి దూఁకు శబ్దంబు — వర్జించి" యను నియమము నీకవి పాటించనే లేదు. తుదలందు ప్రాసములను గూడ పొందించలేదు. ఈ విధముగా నీమంజరీద్విపదలను కవి స్వేచ్ఛానుసారముగా నీకావ్యమున సాగించియున్నాఁడు. ఈ స్వేచ్ఛావర్తనయందును నొక మాధుర్యమున్నది. ఇదియే మాదృష్టి నాకర్షించినది. స్వేచ్ఛావర్తనమును కోరెడు ఆంధ్రసాహిత్యరమణికిదియొక చిన్నయాభరణమై యుండగలదని మా నమ్మకము.

## —: విశిష్టత :—

సాధారణముగా ద్విపదకవిత్వమునకు జనాదరణమెండు. దీనికి "రంగనాథరామాయణము" యొక్క బహుజనాదరణము ముఖ్యమైన యుదాహరణముగా తీసుకొనవచ్చును. ఆంధ్రదేశమందు పల్లెపల్లెలోను జాతియగీతములు మంజరీద్విపదలలోనే యున్నవి. ఊడుపులలోను, దంపుళ్ళయందును పాడు పాటలన్నియు ద్విపదలలోనేయుండుట మన మెఱిఁగినదే. అనాదిగావచ్చుచున్న దశరా పద్యములు కూడ నీతెగకు చేరియున్నవి. బొబ్బిలియుద్ధము, బాలనాగమ్మకథ, పాముపాట, కుశలాయకము మొదలగు గీతములకున్న ప్రచారము పెద్దపెద్ద ప్రబంధములకుండుటలేదు. మంజరీద్విపదబద్ధమైన విశిష్టకావ్యమిదివరలో నెక్కడను కానరాలేదు. ఆలోటును బహుదోషభూయిష్టమైనను, ఈచిన్ని

పాత్రము పూర్తి చేయునని మాయాశయము. ఈ విషయమునుద్దేశించియే మేమీ మైరావణచరిత్రను ప్రచురించితిమి.

## —: పరిష్కరణము :—

మేము గ్రంథాంతరసహాయమున సరిదిద్దినయపపాఠములను ఫుట్ నోట్సులో నిచ్చియున్నాము. కొన్నికొన్ని చోట్లలుప్తమైన భాగములను పూరించుపట్ల, ఆ యా భాగములు బ్రాకెట్లమూలముగా చూపింపఁబడినవి. యతిభంగములు గణ భంగములు సూక్ష్మముగా పరిశీలింపఁబడినవి. అచ్చు పొరపాట్లను తప్పొప్పుల పట్టికలో చూపించితిమి. అట్లుండియు ననేకతప్పులు దొర్లియుండును. కావున పండితులును సహృదయులును ఈమాయుద్యమమును ఆదరింతురుగాక యని ప్రార్థన.

సరస్వతీమహాల్ గ్రంథాలయము,
తంజావూరు. 1950.

పరిష్కర్తలు.

# విషయానుక్రమణిక.


| | పుట |
|---|---|
| కథాప్రారంభము ... ... ... ... | 1 |
| శ్రీరామచంద్రుఁడు హనుమంతుని పరాక్రమమును వర్ణించుట ... | 6 |
| శ్రీరామునకు హనుమంతుని పరాక్రమమును వసిష్ఠుఁడు తెల్పుట ... | 11 |
| రావణుఁడు తన భంగపాటును దలఁచి విచారించుట ... ... | ,, |
| రావణుఁడు మైరావణుని రప్పించి మంత్రాలోచనముఁ జేయుట ... | 12 |
| మైరావణుఁడు దశకంఠునకు బుద్ధిచెప్పుట ... ... | 15 |
| విభీషణుఁడు సుగ్రీవునకు మైరావణుని మాయలఁదెలిపి హెచ్చరించుట | 16 |
| సుగ్రీవుఁడు హనుమదాదులను బిలిచి మైరావణునిగుఱించి చెప్పుట ... | 17 |
| హనుమంతుఁడు వాలంపుకోట నేర్పఱచి రామలక్ష్మణులఁగాచుట ... | 18 |
| మైరావణుఁడు తన పత్నితో రామలక్ష్మణులఁగాళికి బలియిత్తునని పల్కుట | ,, |
| మాతంగి మైరావణునకు హితమును జెప్పుట ... ... | ,, |
| మాతంగిమాటలకు మైరావణుఁడు బదులు చెప్పుట ... ... | 21 |
| మైరావణుఁడు తన యిద్దఱు మంత్రులతో రామలక్ష్మణులను దెచ్చుటకు బయలుదేరుట ... ... ... ... | 22 |
| ఘటికుని రామలక్ష్మణుల వృత్తాంతమరసి రమ్మని మైరావణుఁడు పంపుట | 23 |
| మైరావణుఁడు ఘటికునికి రోషము పుట్టునట్లు నొవ్వనాడుట ... | 24 |
| సూదిముఖుని దంభోక్తులు ... ... ... ... | 25 |
| సూదిముఖుఁడు వాలంపుకోట దరిఁజేరుట ... ... ... | 26 |
| సూదిముఖుఁడు తన ముక్కును బోగొట్టుకొని మైరావణునితో మొఱ పెట్టుకొనుట ... ... ... ... | ,, |
| మైరావణుఁడుపాయాంతరముల నాలోచించుట ... ... | 27 |
| మైరావణుఁడు విభీషణుని యాకారంబునుదాల్చి కోటవద్దకుఁజనుట ... | 28 |
| మైరావణుఁడు హనుమంతుని మోసగించుట ... ... | ,, |
| హనుమంతుఁడు మైరావణుని వార్తలను విని చింతించుట ... | 30 |
| మైరావణుఁడు మాయాబలముచే దాశరథుల నపహరించుట ... | ,, |
| హనుమంతుఁడు రాజులఁగానక చింతించుట ; సుగ్రీవుఁడు హనుమంతుని మందలించుట ... ... ... | 32 |
| హనుమంతుఁడు కోపముచే విభీషణునిపై నాగ్రహపడుట ... | 33 |
| సుగ్రీవుఁడు హనుమంతుని శాంతింపఁజేయుట ... ... | ,, |
| హనుమంతుఁడు విభీషణుని బలుతెఱంగుల నిందించుట ... ... | ,, |
| సుగ్రీవుఁడు విభీషణుని న్యాయవర్తనమును దెలియఁజెప్పుట ... | 34 |

సుగ్రీవుఁడు విభీషణునివలన మైరావణుని మాయల నెఱుంగుట ... 35
హనుమంతుఁడు విభీషణుని మాటలువిని వాపోవుట ... ... 36
అంగదాదులు హనుమంతునకు ధైర్యముఁ జెప్పుట ... ... 37
విభీషణుఁడు హనుమంతునకుఁ బాతాళలంకకుఁబోవు మార్గమును జెప్పుట 40
మత్స్యవల్లభ మరుత్సుతుల యుద్ధము ... ... ... ,,
హనుమంతుఁడు మత్స్యవల్లభుని పరాక్రమమునకు నాశ్చర్యపడుట ... 41
హనుమంతుఁడు మత్స్యవల్లభుని వృత్తాంతమడుగుట ... ... ,,
మత్స్యవల్లభుఁడు తన జన్మవృత్తాంతముఁ జెప్పుట ... ... 42
మైరావణుఁడు రామలక్ష్మణులను గాళికి బలియివ్వఁ బ్రయత్నించుట ... 45
మైరావణుని చేతలకు దోర్దండి వగచుట ... ... 46
ఆంజనేయుఁడు దోర్దండిని సంధించి రామలక్ష్మణుల వృత్తాంతము
చెప్పి తన నిజరూపమును జూపి నమ్మించుట ... ... 47
దోర్దండి హనుమంతునకుఁ దనవృత్తాంతమును దెల్పుట ... ... 49
హనుమంతుఁడు దోర్దండిని సమాశ్వాసపఱచి మైరావణుని గుఱించి
వివరముల నడుగుట ... ... ... 51
దోర్దండి మైరావణుని వృత్తాంతమును హనుమంతున కెఱుకపఱచుట ... ,,
హనుమంతుఁడు ముంగిసరూపమును దాల్చి పాతాళలంకను బ్రవేశించుట 53
మారుతి మైరావణుని మంత్రులను జంపుట ... ... 54
హనుమంతుఁడు దోర్దండిసుతుఁడగు నీలమేఘునకు ధైర్యముఁ జెప్పి
రామలక్ష్మణులను గలిసికొనుట ... ... ... ,,
హనుమంతుఁడు మైరావణుని జంపుటకై పాతాళలంకను బ్రవేశించుట 56
హనుమంతుఁడు పాతాళలంకఁ జొచ్చుటను సూదిముఖుఁడు మైరావ
ణున కెరుకపఱచుట ... ... ... 57
మైరావణుఁడు వృత్తాంతమెల్ల నరసి హనుమంతునితో యుద్ధమునకుఁ
గదలుట ... ... ... ... ,,
హనుమంతుఁడు శతజిహ్వాది రాక్షసులను మడియించుట ... ... 59
హనుమంతుఁడు జంబుమాలిని జంపుట ... ... ... 60
హనుమంతుఁడు అగ్నికేతుని బరిమార్చుట ... ... 61
మారుతిమైరావణుల యుద్ధము ... ... ... ,,
హనుమంతుఁడు మైరావణుని సంహరించుట ... ... 68
మాతంగి విలపించుట ... ... ... ... 70
హనుమంతుఁడు మాతంగి నూరార్చి నీలమేఘ రూపవతులకుఁ బెండ్లి
చేయించి పాతాళలంకకుఁ బట్టంబుఁగట్టుట ... ... 71
హనుమంతుఁడు రామలక్ష్మణ సహితుఁడై మత్స్యవల్లభుని సాహాయ్య
మునఁ గొలను దాటి వానరసేనలఁ గలియుట ... ... 73
శ్రీరామభద్రుఁడు హనుమంతునిఁ బొగడుట ... ... 74

శుభమస్తు

అవిఘ్నమస్తు

# మైరావణచరిత్ర.

## కథాప్రారంభము.

శ్రీ రామచంద్రుఁడా శ్రితవత్సలుండు
కారుణ్యజలనిధి ఘనయశోధనుఁడు
సుజనరక్షకుఁడును సుగుణభూషితుఁడు
సమరారపతిఁ గూల్చి యర్ధితో నపుడు
రాజచిహ్నంబులు రమణతోఁ దాల్చి
యంతనయోధ్యకు నతివేగవచ్చి
పరఁగవసిష్ఠుని పదములకెఱఁగి
వలనొప్పఁ గైక నివాసంబుఁ జొచ్చి
దండప్రణామంబుఁ దగనాచరించి
పిదపసుమిత్రకుఁ బ్రియముతో మ్రొక్కి
మఱివచ్చి కౌసల్యమా[1]ళిగఁ జొచ్చి
తనతమ్ముఁడునుఁ దానుఁ దనపత్ని [2]వేగఁ
జనుదేరఁ గౌసల్య చర్చించి చూచి
జడలు వల్కలములు చిన్నబోకయునుఁ
దబసివేషంబులఁ దనరారుచున్న
తనతనయునిఁ జూచి తలఁపులో నపుడు
వగపునఁ దనభర్త వగపుఁ జింతించి

---

[1] ...రము. [2] యును.

యున్నట్టి తగుతల్లి నూరార్చి పిదపఁ
గొమరొప్పఁదగువారిఁ గుశలంబులడిగి
తనకు మ్రొక్కినఁగని తద్దయు వేడ్క 10
సీతామహాదేవిఁ జెలఁగిదీవించి
మందిరాభ్యంతర మణివేదియందుఁ
గూర్చుండి రెంతయుఁ గొమరుదీపింప.
ఆ విభీషణునకు నగచరులకును
[1]నంగద సుగ్రీవ యాంజనేయులకు
భద్రపీఠంబులఁ బఱఁగఁ బెట్టించి
యంత [2]రాముఁడు పరమానంద[3]మంది
భరతశత్రుఘ్నులు [4]భక్తితోఁ గొల్వఁ
గరువు రోగభయముఁ గలుగకెప్పుడును
దనకు వర్ణాశ్రమధర్మముఁగల్గి
పరిపాటిఁదప్పక బహువిధోపాయ
పరిపూర్తిమై భూమిఁబాలింపుచుండె.
నిత్యకల్యాణముల్ నిత్యసంపదలుఁ
గలిగి వేదధ్వనికలితమై యపుడు
నిత్యోత్సవంబుల నెగడునప్పురము.
పరమసంప్రీతితో భానువంశజుఁడు
చెలువొందఁదమ్ములు చేరి కొల్వఁగను
మఱికొన్నిదినములు మనుజేశ్వరుండు
తనరంగ సుముఖుఁడై తరుచరసేనఁ
బనుపంగవలెనని యాత్మలోఁదలఁచి 20
భరతుని దెసఁజూచి పలికె రాఘవుఁడు.

---

[1]సుగ్రీవుడంగదు సుషేణాదులకును. [2]రఘువుండు. [3]డగుచు [4]బలసితను.

"కపిసార్వభౌములు ఘనబలోద్దండు
లతులితసాహసులలసి యున్నారు
వలనొప్ప వారి నివాసంబులకును
నతిభక్తితోఁడుత ననుపంగవలయు
నటుగానఁగొలువుకు నాయిత్తపడుఁడు."
పరఁగ శత్రుఘ్నునిఁ బనిచెనాక్షణము
పనిచిన సంప్రీతిఁ బరఁగనా కపులఁ
గొమరొప్పఁబిలిపించి కొలువుకూటాన
గంధంబు పన్నీరుఁ గలుపఁగఁజేసి
దివ్వెలు ముట్టించి దివ్యంబులైన
ముత్యాలముగ్గులు ముదమొప్పఁబెట్టి
మణిమయదీప్తుల మహిమఁజెన్నొంద
సమ్ముఖంబునకును సరగఁదెప్పించి
పూజించి వేడుక భద్రపీఠంబు
మానుగాఁబెట్టించి మణివేదియందుఁ
గరమర్థి నవరత్నగద్దె వేయించి
హితుల మంత్రుల పురోహితుల నాశ్రితుల
[1]వరవసిష్ఠాదుల వరుస రప్పించి
కవిబుధపాఠకగాయకాదులను 30
భరతశత్రుఘ్నులఁ బరఁగ రప్పించి
తెలుఁగొప్ప ఛప్పన్న దేశాధిపతులఁ
దంత్రజ్ఞులను వీరదండనాయకుల
గణనకుమించిన గజ[2]వాహకులను
[3]నతిరథముఖ్య మహారథికులను

---

[1]పరవసిష్ఠాది మునులరప్పించి. [2]వాహనముల. [3]అతిరథమహారథులాదిసమరథుల.

ప్రియ మొప్ప నందఱఁబిలిపించిరపుడు.
రంజిల్ల పజ్జనుబ్రద్దలువారు
బడవాళ్లు మొదలుగా పరమహర్షమున
[1]రాయభారుల వేడ్క రాజముఖ్యులను
రప్పించికొలువుండిరా వేళనందు.
అంతలో రఘురాముఁడానందమొంది
చెలువొప్పఁ బన్నీట జలకమ్ములాడి
కస్తూరినామముఁగర మొప్పఁదీర్చి
దివ్యాంబరంబులఁ దెఱఁగొప్పఁగట్టి
యలరు శ్రీపాదాలనందెలుఁ బెట్టి
నూతనంబుగ మొలనూళ్లనమర్చి
కంకణంబులు రత్నఖచితమైనట్టి
బాహుదండంబులఁ బద్మలోచనుఁడు
పథకంబు నురమున బాగుగాఁబెట్టి
రవికోటిదీప్తుల రంజిల్లుచున్న
రత్నకిరీటంబు రవికులోత్తముఁడు
శిరసున ధరియించి చెలువుదీపింప
మదనకోటిప్రభ మహిమఁజెన్నొంది
విప్రులుదీవింప వేదమంత్రముల
[2]నక్షతల్ చల్లిరి యతివేడ్కతోడ.
నగరువెల్వడి వచ్చినరలోకవిభుఁడు
పరఁగంగ మంగళపాటకుల్ పొగడ.
వలనొప్పఁగొలువుకు వచ్చిరాఘవుఁడు
సింహాసనంబునఁ జెలగికూర్చుండి

---

[1] రాయభారులు నియోగులను వేడ్క. [2] అక్షింతలొసంగి చల్లిన.

చెలువొందఁ దమ్ములు చేరికొల్వఁగను
నఖిలలోకారాధ్యుఁ డసురాంతకుండు
నగుసత్యకల్యాణుఁ డమితవిక్రముఁడు
రాఘవుఁ డభినవరాజశేఖరుఁడు
వర్ణాశ్రమంబుల వరుసఁ బాలించి
బహువిధశాస్త్రముల్ పరఁగువిద్యలనుఁ
బరికించి సంతోషపారీణుఁ డగుచు
వెలయంగ వానరవీరులఁ జూచి
చిత్త[1]ము రంజిల్లఁ జిరునవ్వు నగుచు
సంతోషమునఁ గృపా[2]సంరంభమునను  50
దలఁపున మోహంబు దైవారుచుండ
వలనొప్పఁ బలికె నావాలిమర్దనుఁడు.
"మీరు మహాత్ములు మీరు బల్లిదులు
మీరుచేసిన మేలు మేదినిమీఁద
వెలయంగ[3] రాక్షస వీరులతోడ
రావణాదుల నెల్ల రణభూమిఁ జంపి
జానకిఁ జేకొంటి సంతోషమునను.
పరఁగంగ(దీర)ని బంధువుల్ మీరు
తగ నిక్కడికివచ్చి తడవాయ నింక
మినివాసములకు మీ రేఁగుడనుచు
సుగ్రీవుఁడాదిగా శూరుల నెల్లఁ
బిలుపించి వేర్వేరఁ బ్రియములఁ జెప్పి
కరముర్థిఁ దగినట్టి కట్నంబు లిచ్చి
హనుమంతుఁ గొనియాడి యతని రప్పించి

---

[1] మంతోషముగా. [2] సందటిగొసంగ. [3] నా. దనుజ.

కరుణించి వేడ్కతోఁ గౌఁగిటం జేర్చి
యర్ధాసనంబున నాతని నునిచి
వెలయఁగఁ గొలువెల్ల విస్మయంబందఁ
గామరొప్పను సువాశకులగురుండైన
సంయమీంద్రునిఁ జూచి చయ్యనఁ బలికె.

—:శ్రీరామచంద్రుఁడు హనుమంతుని
పరాక్రమమును వర్ణించుట:—

"వరమునిశ్రేష్ఠ! యీ వాయునందనుఁడు
యెంతవాఁడనవచ్చు నిందటికోన
హనుమంతుఁడనఘుఁడు నాత్మబంధుండు
[1]నానరంగఁ జేసిన యుపకారమునకుఁ
[2]ప్రత్యుపకారంబు వలెనె చేయంగ,
చెప్పెదనీతండు చేసినలావు
భూసుతఁగోల్పడి పొలుపొందవచ్చి
పంపానదీతీరప్రాంతంబునందుఁ
[3]గణఁగి నాతోడు లక్ష్మణుదుండఁ జూచి
భానుతనూజుండు భయమందుటయును
వలదని వారించి వనచరేశ్వరుఁడు
కడుభక్తిమేమున్న కడకేఁగుదెంచి
యతని వృత్తాంతము నంతయుఁ జెప్పి
పరఁగ నాతని మాకు బంధుగాఁ జేసి
సీతభూషణములఁ జెలువొందఁ జూపె.

---

[1] వానరనితండుచేసెను. [2] పరంగాగ నెట్లట్లు. [3] కణంగి లక్ష్మణుండుపై ండుండంజూచి

[1]ఆవాలిమర్దించి యా [2]రవిసూనుఁ
బరఁగఁ గిష్కింధకుఁ బతిగానుజేసి
కపిసేనలన్నియుఁ గరమర్థిఁగూర్చి
వెరగొప్ప జానకి[3] వెదకఁబుచ్చుటయు
ముదమొప్ప[4] నావ్రేలిముద్రికఁగొనుచుఁ
దారాసుతునితోడఁ దరుచర్లతోఁడ 70
వెలయుదక్షిణ భూమి వెదుకంగఁబోయి
యంబుధిఁగడ కేఁగి ఘండఅనునిచి
యరయసముద్రంబు నవలీల దాఁటి
తానొక్కరుఁడెపోయి తగలంకఁజొచ్చి
చొరరానిచోట్లఁ జొచ్చిశోధించి
కలయనంతటఁ జూచి కానంగరాక
వడలక [5]దనుజేంద్ర వనములోపలను
జానకిఁబొడగాంచి చతురుఁడై నిలిచి
ముదమొప్ప నావ్రేలి ముద్రికనిచ్చి
వెలయసీతకుఁ దనవృత్తాంతమెల్ల
నెఱుఁగించి మాయున్కి నెఱుఁగించి పిదప
ధరణిజమదిలోని తాపంబు[6] మాపి
యాయింతియిచ్చిన యాన[7] వాలంది
వనితచేనధికపు[8] వరములు వడసి
సంతసంబునఁజని చదురుఁడై మెఱసి
వదలక దనుజేంద్రు వనమెల్లఁబెఱికి
వనపాలకులఁజంపి వాయునందనుఁడు

---

[1] ఆతనిపగసాధించి. [2] కలిసూను. [3] వేడ్క. [4] తనవ్రేలి. [5] యాదనుజ.
[6] మాన్పి. [7] బాలంది. [8] వలములు.

వెనయునగ్రణ్యుల నేవురఁజంపి
మహినొప్పనేడ్గురు మంత్రినందనుల
నరయంగఁదునుమాడి యక్షయుఁజంపి 80
[1]శక్రారితోఁబోరి చాలనొప్పించి
బ్రహ్మాస్త్రనిహతి[2]కిఁబద్ధుడై పోయి
యాసభాంతరమున నతనిభర్జించి
వానియాజ్ఞకుఁ దనవాల మొప్పించి
నెరయలంకాపురి [3]నిగుఱుఁగావించి
తిరుగ జానకి చేత దీవెనలంది
పటుభుజశక్తిమై పశ్చిమద్వార
మునను న్నలంకిణి [4]మొక్కపోఁజేసి
యరుదైన జలనిధి నవలీలదాఁటి
యంగదాదులఁగూడి యలరుచువచ్చి
రవిసుతునకుఁ దమగా[5]కనుఁదెలిపి
సీతమాటలుఁదెల్పి సేమంబుఁజెప్పి
మగువశిరోమణి మాకునందించి
వెలయంగ మామది వేదనఁదీర్చి
తరుచర సేనతోఁ [6]దరలితావచ్చి
వలనొప్ప నలునిచే వార్ధిఁగట్టించి
యావిభీషణునకు నభయంబులిచ్చి
వనచరసేనల వార్ధి దాఁటించి
లంకపై విడిపించి లావులుమెఱసి
దనుజాధివీరులఁ దనవాలతతుల 90

[1] యింద్రారి. [2] చేపట్టుబడి. [3] నీరుగా. [4] నుక్కణగించి. [5] రొఱుగించి. [6] తగగదలించి.

నరుడుగాఁ జెండాడి యావహంబునను
వాయుపుత్రుఁడుగాన వాయువుకరణిఁ
దగనన్ని దిక్కులఁ దానయ్యైయుండి
యెచ్చోట [1]నరసిన నచ్చోటఁదానె
యుద్ధంబుఁ జేయంగ నురుభుజబలిమి
నింద్రారిశరహతి వేదనబొంది
కపిసేనలన్నియుఁగలఁగి మూర్ఛిల్లె.
సౌమిత్రియును సేము సహితంబుగాఁగ
నతిదైన్యవృత్తిమై నలయుటఁజూచి
దైవవరంబునఁ దరుచరేశ్వరుఁడు
మూర్ఛనొందడుగాన ముదము దీపింప
వలనొప్ప నాజాంబవంతునిచేత
నలర సంజీవనీయౌషదం బెఱిఁగి
యతివేగమునఁబోయి యౌషధాచలముఁ
బెకలికి చక్కటనిడి పెంపొందఁదెచ్చి
పరఁగంగనండటి ప్రాణంబు నొత్తి
సౌమిత్రిప్రాణంబుఁ జయ్యన నెత్తి
శరమర్థినామదికలఁ కెల్లఁదీర్చి
యెనయంగ నాప్రాణమెత్తెనత్తరిని
హనుమంతుఁడెంతవాఁడనవచ్చునరయ  100
నతనిఁబ్రస్తుతిచేయ నెవ్వరి వశము"
అని యిట్లు రాఘవుఁడనిలజుఁబొగడ
వరవసిష్ఠుఁడు రామవసుధీశుకనియె.
"రాజీవదళ[2] నేత్ర! రఘురామచంద్ర!

[1] దగినయచ్చోట. [2] నయన.

సంగ్రామబలభీమ ! జయమనోధామ !
సీతామనోరామ ! శ్రీరామ ! రామ !
కొమరొప్ప హనుమంతుఁ గొనియాడితిపుడు
యిదియు విచిత్రమా యినవంశతిలక !
యరయ రాజుల [1]తోడ నాలంబులోనఁ
జంచలింపక లావు సేయంగవచ్చుఁ
బతిపేరుగొని నిల్చి బవరంబులోన
నధికునినైన మూరవలింప వచ్చుఁ
బతి లేకఁ గార్యంబుఁ బరఁగనేకాకి
చింతింపవచ్చునే శ్రీరామచంద్ర !
చెలఁగి మీయాన టను జేసినలావుఁ
బొగడితి రఘురామభూవర ! నీవు
నరయ సీతని లావుకచ్చెరు [2]వొంద
[3]నున్నవారందఱు చిన్నవారిందు
[4]నెన్నఁగ నెక్కువా సీతనిలావు
వినవయ్య చెప్పెద విశ్వలోకేశ ! 110
పగ లెవ్వఁడైనను బంతంబు మెఱసి
చెలఁగి కయ్యంబులు సేయంగవచ్చు
నాయర్ధరాత్రి మీకైనఁ బోరామి
కీతఁడుఁ దీర్చెఁగా కితరుల తరమె
యూ తెరంగంతయు నర్కజుఁడెఱుఁగు
నిజయోగమునుఁ జేసి నే మెఱుంగుదుము''
అనవుఁడు రఘురాముఁడాశ్చర్యమంది

---

[1] నెదుట. [2] వుదలఁప. [3] వున్నవారందు నిట చన్నవారందు. [4] యెన్న చెప్పంగ నెక్కుండితనిలావు.

ముకుళితహస్తుఁడై ముదముదీపింప
నదియెవ్విధంబటులానతీవలయు
నని ప్రణమిల్లిన నమ్మునీశ్వరుఁడు
రాఘవు దెసఁజూచి రమ్యాత్ముఁడగుచు
వెలయునా వనచరవృత్తాంత మెల్లఁ
జెప్పంగ దొడఁగె[1]ను జెవులూరనంత.

—: శ్రీరామునకు హనుమంతుని పరాక్రమమును వసిష్ఠుడు తెల్పుట :—

పరఁగంగ లంకపై భానుకులేశ!
విడిసి యుద్ధము సేయ వెలయంగ మీరు
[2]పెక్కురక్కసులనుఁ బేర్కొని చంపి
మర్కటసేనలు మలయుచుండఁగను
దనమది బెగడొంది దనుజనాథుండు

—: రావణుఁడు తన భంగపాటును దలఁచి విచారించుట :—

"పరఁగ శ్రీరాముని బాణాగ్నిచేత
భస్మమైపోయిరి పటుభు[3]జబలులు 120
[4]అతికాయుఁడును నామహాకాయుఁడరయఁ
గుంభకర్ణాదులు కూలిరి ధరణి
దురములోని రిపులఁద్రోలి నిర్జింపఁ
జాల నాఘనశక్తిఁ[5]జను దెంచుఘనులు
వాయుతనూజుండు వనచరోత్తములు

[1] నాగుంయు మీశ్వరుడు. [2] పెక్కండ్రు రాక్షసుల. [3] భుజాభటులు. [4] అతికాయుండు మహాకాయుండు. [5] చెన్నొందు.

ధట్టించి గెలువంగఁ దరముగాదింక;
కడఁగి మహోత్పాతకారణముగుటఁ
జెలఁగిరాముఁడు తెంపుసేయఁడుగాని
యరుదుగాదివ్యాస్త్ర[1]హస్తుఁడౌనేని
యొక్కటఁ దెగ[2]టార్చు నొనరంగనన్ను
నావిభీషణుకోర్కెలన్ని సిద్ధించు
పరఁగఁ గుందిన విని పరులు నవ్వుదురు."

—: రావణాఁడు మైరావణుని రప్పించి
మంత్రాలోచనముఁ జేయుట :—

అనిభయంబునునొంది యాత్మలోపలను
జింతించి తలపోసి చిత్తంబు కలఁగఁ
బరఁగ మాయోపాయబలమునఁగాని
వీరుల గెల్వంగ వెరవుగాకనుమ
మదిసంతసంబొంది మహిరావణుండు
అధికమాయోపాయుఁడతిసత్వధనుఁడు
నాభుజబలిమిగా నమ్మినవాఁడు
పాయని చెలికాఁడు పరమసాహసుఁడు 130
ఆతనిచేఁగాని [3]యర్కవంశజుల
నరయగెల్వంగరాదని నిశ్చయించి
[4]రావణుఁడపుడు మైరావణుఁదలఁచె.
తలఁచినంతట వాఁడు తనమదిలోన
నతిసంభ్రమంబున నానందమొంది
దశకంఠుఁ[5]డిల్లెలఁ దలఁచెనోయనుచు

[1] మందుకొనినేని. [2] జూచు. [3] యినకులోత్తముల. [4] రావణుడప్పుడు. [5] డిదియాల

మంత్రిసమేతుఁడై మానుగావచ్చి
దశకంఠుముందటఁ దడయక నిలిచి
"యేమి రావణ! నీకు నింతకార్యంబు
పుట్టెను దలఁచితి పొలుపొంద నన్ను?
పంపుమేపనియైనఁ బరఁగఁజేసెదను
చారవనీశ్వరుకైనఁ జోపుడుఁబెడుదు
బ్రహ్మాదిసురలను బట్టి భర్జింతు
నాపోశనముఁగొందు నంబుధులెల్లఁ
గులపర్వతంబులఁ గుదియించి పెఱికి
తోరంబుగాఁబెట్టి దొంతులుపేర్తు
ధర నెల్లఁబిడికిట దర్పించిపట్టి
పాడిపాడిగాసేతుఁ[1] బొంకంబు మెఱసి
నీవేలవెఱచెదు నిఖిలైకవీర!"
అనవుండు దశకంఠుఁడాత్మలోనుబ్బి 140
యతనికౌఁగిటఁజేర్చి యర్ధాసనమున
నతివేడ్కతోనిల్పి యతిముదంబెసఁగఁ
దనపూర్వకథ నెల్లఁ దగఁజెప్పఁదొడఁగె.
"వినుమహీరావణ! విశ్వలోకమున
రఘువంశతిలకులు రామలక్ష్మణులు
తమతండ్రిపనుపున దండకాటవిని
చెలఁగి తపోవృత్తి[2] చేనొప్పుచుండఁ
[3]జెన్నొందనొకనాఁడు చెల్లిశూర్పణఖ
వారలమదిఁగోరివచ్చినఁబిదప
రాముఁడు సౌమిత్రి నలవేడ్కఁ జూచి

---

ంబు. [2]జరియింపుచుండ. [3]వొక నాఁడు శూర్పనివి యుల్లాసియగుచు.

యెందుండివచ్చెనో యీ[1] మోహనాంగి
శిక్షింపమనవుఁడు చెలఁగియాక్షణమె
ముక్కులుఁ జెవులును మొందుగాఁ గొట్టి
ఖండించి పంపిన ఖరుఁడు కోపించి
దండెత్తి పోయిన దర్పంబు మెఱసి
దూషణత్రిశిరులతో హరిఁజంప
(బంగరులేడిగాఁ బంపిమారీచు)
[2]బంధుమర్దకులనుఁ బడతితోఁ జీల్చి
[3]జనకతనూజనా చపలలోచనను
జెఱఁబెట్టి తెచ్చితిఁ [4]జెడ్డకోపమున 150
(నినకులోత్తములంతనీవార్త నెఱఁగి)
వానరసేనతో వార్ధిఁగట్టించి
యీలంకపై విడిసి యిట్టిరాక్షసులఁ
బెక్కండ్రఁజంపిరి పృథ్వికంపింప
బలియురు పెక్కండ్రు పడిరి భూస్థలిని
[5]పటు విభీషణుఁడంతఁ బగవారిఁగూడె,
అటుగాన నీప్రాపునర్థించియేను
చలమునవాపగసాధింపవచ్చు
నని నిశ్చయం[6]బంది యాత్మలోనుబ్బి
నినుదలఁచితి నేను నిఖిలైకవీర!"
అనమహిరావణుఁ డాత్మలోపలను
గనుఁగొని పల్కె నిష్కపట భాషలను

---

[1]మోహకాలి. [2]బందుమర్దకుగా బలినిచ్చి మారీచు. [3]నా లంగకే జానకి తోడ్కొని తెచ్చి. [4]చెటుల. [5]పరఁగ విభీషణుడంత. [6]యెంచితను.

—: మైరావణుఁడు దశకంఠునకు బుద్ధి చెప్పుట :—

''వినవయ్య రావణ! వీరపుంగవుఁడ!
యిదియేల యెఱుఁగవే యిట్టికార్యంబుఁ
జేయఁగనుచితమే చింతించి చూడఁ
బరభామఁ దెచ్చుట పంతమే నీకు
సకలశాస్త్రంబుల సకలధర్మముల
(నెఱఁగిన వాఁడవు రోమందు నిన్ను)
పరసతిపై దృష్టి పాపకర్మంబు
[1] తగఁబరసతిఁగూడఁ దలఁచినవాఁడు    160
పొలుపొందగా భువి పురుషాధముండు.
వెఱ్ఱివాఁడైనను నీఁచుఁడైయైన
బంద[2] యైయున్నను బాపాత్ముఁడైన
బుద్ధిహీనుండైన భువనంబులోనఁ
జెలువొందఁదనవాఁడు చెప్పినబుద్ధి
వినవలెనటుగాక వినకుండెనేని
యొనరంగ దానికి నుత్తరంబిచ్చి
పరగంగఁ బ్రియములుఁ బలుకుదుగాని
తనవారి విడుతురా తగబుద్ధిమాలి
పొలుపొందఁదరువునఁ బుట్టినశాఖ
పరగంగఁదరువునుఁ బాసి పోయినను
[3] ౽దికుఠారంబుతో నలరంగఁజేరి
పడపడి తరువులఁ బట్టిచెండాడుఁ
దద్గతిఁదలఁపవు ధనుజాధినాథ!

---

[1] మోహించి పరసతి ముగిగూఁడదలచు. [2] వాండైనను. [3] గొనకొనియువికుటారంబునగూడి.

తన సేనవారుని చేఁదగఁ గోలుపోయి
జయముఁగోరెడువాఁడు చపలుఁడుగాఁడె
అటుగాన పౌలస్త్య! యావిభీషణుని
విడిచిన ప్పుడే నీవు కీడెడివైతి
కాదె; నీకెఱుఁగని కార్యంబుగలదె''
అని నీతివాక్యంబులతనికిఁ జెప్పి 170
పంక్తికంధరుఁ జూచి పదపడి యనియె
''కడచిన కార్యంబుఁ గలవె తలపోయ
బుద్ధిచెప్పితిగాని భువనైకవీర!
యిదెకొని పోయెద నినకులోత్తములఁ
బరగంగ నాయట్టి బంధుఁడుకలుగఁ
దలఁకనేటికి నీవు దశకంధరుండ!
యేమరకుండుమీ'' యనిసాగిపోయె.
అంతలో నీవార్తలంతయుఁ దెలిసి
యావిభీషణుపత్నియైన యాసరమ
పరఁగఁగ నొయ్యనఁ బన్నరులచేతఁ
బొలుపొంద నీవార్త వృత్తాంతమును
విని విభీషణుఁడతివిస్మయంబునను
దనమదిలోన నెంతయు బెగడొంది
యతిసంభ్రమంబున నర్కజుఁ జూచి

—:విభీషణుఁడు సుగ్రీవునకు మైరావణుని మాయలఁ దెలిపి హెచ్చరించుట :—

''వినవయ్య సుగ్రీవ! వీరపుంగవుడ!
యిదియొక్క యుత్పాత మిప్పుడుపుట్టె

మహిరావణుండను మనుజాశనుండు
దశకంఠుపనుపున ధరణీశ్వరులను
మునుకొని పాతాళమునఁ గొనిపోవ
నాతఁడు పసిబూని నశ్లేఁగినాఁడు 180
వానిఁగానఁగరాదు వనజాసనకైన
మాయల మతముల మంత్రయంత్రముల
నధికుఁడాతని గెల్వ హరిహరాదులకుఁ
దరముగాదటుగాన ధరణీశ్వరులను
గావఁగలేనయ్య కపికులోత్తముఁడ!
చెలువొంద వనచరసేనలనెల్ల
వెలయంగ దగ్గఱ [1]విడియంగఁజేసి
యరుగుము నీవింక నన్నిదిక్కులకు"

—:సుగ్రీవుడు హనుమదాదులఁబిలిచి
మైరావణునిగుఱించి చెప్పుట:—

అనవుండు సుగ్రీవుఁడతిసంభ్రమమున
హనుమంతు మొదలుగా నందఱంబిలిచి
"యీవార్త వింటిరె! యింతయు మీరు
కరమర్థి రాజులఁగావంగవలయు"
అనవుండు కపివీరులవుగాక యనుచుఁ
బోయి యనిలజుని బుద్ధినూహింప
[2]నంజనాసుతుఁడంత నటకేఁగుదెంచి

---

[1] విడుపుమని చెప్పి. [2] చెటవొంద వానర సేనల నెల్ల.

—:హనుమంతుఁడు వాలంపుకోట నేర్పఱచి రామలక్ష్మణులఁ గాచుట:—

కోమరొప్ప వాలంబుఁ గోటగాఁదీర్చి
పాతాళమునఁగొంత ప్రబలంబుగాఁగ
మింటికినెగయించి మిన్ను ముట్టించి
వజ్రపంజరముగావడిఁ జుట్టుముట్టఁ
(జెలువొంద వానరసేనలప్పుడును)
నత్యంత శూరులై యందుండిరంత.

—:మైరావణుడు తన పత్నితో రామలక్ష్మణులఁ గాళికి బలియిత్తునని పల్కుట:—

మరిసంభ్రమంబున మహిరావణుండు
దశకంఠుపనిబూని తనపురికేఁగి
తననివానముఁజొచ్చి తనపత్నిఁబిలిచి
పౌలస్త్యపగతుల భానువంశజులఁ
బరఁగంగఁగొనివచ్చి భద్రకాళికిని
బలియిత్తునేఁడు నాపంతంబుమెఱయఁ
గొమరొప్ప నీవింట గృహదేవతలను
నర్చింపు మనవుఁడు నతిభీతిఁబొంది
మాతంగి చలియించి మహిరావణేశుఁ
గనుఁగొని పలికె [1] గద్గదకంఠి యపుడు

—:మాతంగి మైరావణునకు హితమును జెప్పుట:—

ఇదియేమి రావణ! యీవిచారంబు

[1] నాగకంఠియగుచు.

చింతింపఁ దగునయ్య చల్ల బోనేఁడు
పనిలేని పనినీకుఁ బగయేటికయ్య
ఒరుఁబగ నీమీఁద నూహించుకొనుట
బుద్ధియెరాజ్యంబుఁ బోనాడుకొనుట
నీతివిరోధంబు నిఖిలంబులోనఁ
జెప్పెద వినవయ్య శ్రీరాఘవుండు
పరఁగ రావణుఁ [1] బాధఁబడ లేక వేగ
[2] మురహరితోసురల్ మొఱఁబెట్టుకొన్న 200
కారణవశమునఁ గౌసల్య[3] యందుఁ
బుట్టెనాదనుజులఁ బోకార్చుకొఱకు
నటుగాన నరుఁడుగాఁడతఁడు శ్రీవరుఁడు,
పిన్నప్రాయమునాఁడు పెర్మిఁగౌశికుఁడు
యాగసంరక్షకై యర్థించుటయును
[4] ననుజలక్ష్మణునితో నటఁగూడి వేడ్కఁ
దనతండ్రి పనుపునఁదగ మునీశ్వరుని
పనిపూని యటుబోయి పంతంబు మెఱయఁ
బరఁగ సుబాహుని భస్మంబుచేసి
తాటకిఁదెగటార్చి తడయ[5]క వేగ
మారీచుఁ [6]బోద్రోలి మహిమ చెన్నొంద
యసఁగంగ మునివరు యాగంబుఁగాచె
[7] సకలదనుజులనుఁ జావంగఁగొట్టు
దివ్యబాణంబులఁ దెఱఁగొప్పవడసి
వలనొప్ప నామునివరునితోఁగూడి

---

[1] జేరిబాధలకుగాక. [2] ముదమునత్రిదశులు. [3] వలన. [4] లక్ష్మణసహితుఁడై రాజిల్లువేడ్కా. [5] కాక్షణమె. [6] పాదలి. [7] సకలదనుజుల ద్రుంపజాలినయట్టి.

చనుచు గౌతమపత్ని శాపంబు మాన్పి
జనకునియింటికి సరగునఁబోయి
త్రిపురసంహారువిల్లుఁ దెగువమై విఱచి
వైదేహిఁజేకొని వచ్చియుద్ధతిని
పరశురాముని బాహుబలము నిర్జించి 210
వచ్చియయోధ్యలో వసియించినాఁడు,
తొలి[1]మత్స్యరూపుఁడై తోయధిఁజొచ్చి
వేదచోరకుఁబట్టి విదలించినాఁడు,
అమృతంబు కొఱకునై యసురులు సురలు
(మందరాద్రినిఁగొని మథియింపనపుడు)
అంబుధివెఱువంగ [2]నద్రిక్రుంగినను
గూర్మావతారుఁడై కొలఁదెన్నరాని
[3]మందరణ్ మోసిన మధుసూదనుఁడు,
జగములన్నియుఁ బట్టి చాపగాఁజుట్టి
కొనిపోయి పాతాళగుహఁజొచ్చినట్టి
దనుజుని వరహావతారుఁడై త్రుంచి
భూమిఁదెచ్చినయట్టి పురుషోత్తముండు,
కోపించి కంబానఁగొమరొప్ప వెడల
నరసింహుఁడై వానినఖములఁజీరి
బ్రహ్లాదుఁగాచిన పరమాత్ముఁడితఁడు,
వామనుండై పూని వసుమతిఁగొనుచుఁ
బాతాళమునబలిఁ బడఁద్రొచినాఁడు,
జన్నిగట్టులరాజు జమదగ్నియందు

---

[1] మతస్వయతి. [2] అవని. [3] మహియెల్ల. [4] విప్రులకై పూనిజమదగ్ని........,
[5] చిచ్చాటి.

రాముఁడై జనియించి రాజుల నెల్లఁ
బట్టి చెండాడిన భక్తవత్సలుఁడు, 220
త్రిదశులభయ మెల్లఁ దీర్చుటకొఱకు
రాముఁడై జనియించె రఘువంశమునను.
ఇట్టి రాముని దేవి నెఱుఁగక తెచ్చి
ముదమునఁ ద్రిదశారి మురియుచున్నాఁడు
పుట్టిన మాత్రాన మునిఁగించునతనిఁ
[1]బోరున కీడ్చుట పొసఁగునే నీకు
వారలఁ దెరఁబోకు వలదు రావణుఁడ !
యీరాజ్యభోగంబు లిట్టిసంపదల
నీధరనేలుచు నిట్టి సౌభాగ్య
మనుభవించుట లెస్స యవినీతి మాను
నీతంత్రి పగఁగాదు నీపగఁగాదు
తలపోయ నిదియును ధర్మంబుఁగాదు.''
[2]అని యిట్లు బలుకంగ నాసతి యపుడు

—: మాతంగి మాటలకు మైరావణుఁడు బదులు చెప్పుట:—

(మైరావణుఁడనియె మాతంగిఁజూచి)
''నీవు చెప్పినబుద్ధి నేవిటి నేని
పరలోకదూరంబు భావించిచూడ
నాదశకంధరుఁ డాపదఁ బొంది
యక్కఱపడిపంప నాపనిఁబూని
మానిన జగములో మగువరో! నగరి
యెంతైనఁ జనవారి కెడలినచోట 230

[1] [illegible] [2] [illegible]

బ్రహ్మరుద్రాదులపై నైనఁబూని
పగనిర్వహింపుట పంతంబుగాక
యింతి ! నీమాటకు నేమానియుంట
మానుగా జగములో మగపాడిగాదు
వెలయంగవీరుఁడో వీరభద్రుండో
యేలచింతించెద నీమానవులకు
నటుఁబోయి తెచ్చెద''నని వీడుకొలిపి

—:మైరావణుఁడు తన యిద్దఱు మంత్రులతో రామలక్ష్మణులనుఁ దెచ్చుటకు బయలు దేరుట:—

తనమంత్రులగువారిఁ దనరనిద్దఱిని
ఘటికాసూదిముఖులఁ గరమొప్పఁజూచి
తెఱఁగొప్ప రాజులఁ దెత్తుముగాన
నాయత్తపడుడని యటువీడుకొలిపి
చౌషష్టివిద్యలఁజతురుండుగాన
నాయత్తపడఁజూచె నవుడు రావణుఁడు
కలనిగారులబొంది కప్పురొయ్యయును
గాలిచీరయు నీలికాశయునమర
వలనొప్పభూతియు వాయుబంధనముఁ
గనుగట్టు భూకట్టు కావువిభూతి
యుద్వేషణంబును నుత్కర్షణంబు
మోహనభస్మంబు మొదలైనయట్టి
మందులువసియించి మానుగావెట్టి
మంత్రిసమేతుఁడై మైరావణుండు
లంకకు పాతాళలంకకు నొక్క

వనజనాళముతోడ వాటమైయున్న
యామార్గమున నాతఁడతివేగఁగదలి
వచ్చియానాళంబు వాకిటన్నిలిచి
నెలకొని యొకతరునీడఁగూర్చుండి
చెలువొందు నరసేనలన్నియుఁ జూచి
సొంపార ఘటికునిఁజూచి యిట్లనియె.

—: ఘటికుని రామలక్ష్మణులవృత్తాంతమరసి రమ్మని
మైరావణుఁడు పంపుట :—

" తరుచరసేనలోఁ దడయక చొచ్చి
సన్నిధానముఁజూచి సర్వంబునరసి
రొనరంగ రాజులు నున్నచోటెఱిఁగి
వేవేఁగరమ్మని వీడుకొల్పినను
గామరొప్పఁబనిబూని ఘటికుండుఁబోయి
కొమరొప్పు నాసేనఁ దిరిగిరాఁజూచి
యంజనీసుతువాల మాకృతిఁజూచి
కరమొప్పువాలంబుఁ గదలించిచూచి
యలవిగానక మొగసి యాకాశమునకు
నటఁజనరాకున్న నతఁడేఁగుదెంచి
యవివిన్నపముసేయ నతనితోననియె.
వలనొప్ప హనుమంతు వాలంపుకోట 250
నొప్పుగా దృఢశాలి యొప్పారఁజూచి
చంద్రసూర్యులకును సాధింపరాదు
యతిశయమైనట్టి యావాలమహిమ
నేమనిచెప్పుదు నెన్నదుఁజూచి

ఊఱుఁగము రావణ! ఈభువియందుఁ
జెలఁగి వానరవీరసేనలకెల్లఁ
దనవాలమల్లార్చి తగఁగోటసేసి
భూమికి మింటికిఁ బోరామిఁజేసి
హనుమంతుఁడెంతయు నలవాయుదేవుఁ
గరణి విజృంభించి కాచుచున్నాఁడు.
అటుగానభేదింప నజానకునైన
కొలఁదిగాదన'' వాఁడు కోపించిచూచి,

—: మైరావణుఁడు ఘటికునికి రోషము పుట్టునట్లు
నొవ్వనాడుట :—

పాలుపొందఁబగవానిఁ బొగడెడువాఁడు
యేపాటిశూరుఁడౌనిల మీఁదనతనిఁ
గరమర్థినాముఁదు ఘనముగాఁజేసి
పగవానిపొగడెడు పందవుగాన
మగపాటి పోకార్చి మానంబుఁదూలి
భీతిల్లి పాసఁ జెడిప్రేలమగాక
యిట్టిమాటలు శూరులేల పల్కుదురు
సూరులకిట్లేల చొప్పదునయ్య 260
కొమరొప్ప మాప్రాపుఁ గోరినవెనుక
పంతమాటలు మగపాటియేనీకు ''
అనియిట్లు ఘటికుని నాడుటఁజూచి
నూదిముఖుండంత శూరుఁడై పలికె,
'వలదుమైరావణ! వనచరసేన
వేఁగతి నున్నదోయిట్లాడనేల

ఘటికుని నూరక కారింపనేల
వలనొప్పనేఁ బోయివచ్చెదఁజూచి ''
అనవుండు రావణుండత్యుగ్రగతిని
ముదమొప్పఁగా సూదిముఖు దెసఁజూచి
'' వానరసేనెంత వాయుజుండెంత
అదియంతనూరకె యడలుచున్నారు
మదిలోన వెలుఁగని మంగళముఁజూచి
పెనుపొండశునకింబు బెదకినయట్లు
ఘటికుని మాటకుఁ గలఁగెదవీవు''

—: సూదిముఖుని దంభోక్తులు :—

[1]అనగ సూదిముఖుఁ డత్యంతగర్వమున
బలువడిదర్పించి బాహాప్పళించి
'' వినవయ్య రావణ! వీరవుంగవుడ!
వలినొప్ప నెఱుఁగవా నా బాహుబలము
దివిజులనందఱుఁ దెగటార్చినాఁడ
నమరలోకంబెల్ల నల్లాడఁజేసి
యమరేంద్రునరకాల [2]నణఁచినవాఁడ
నొనరనంబుధులెల్ల నొకచేతఁజల్లి
మత్స్యకూర్మంబుల మాల్లాడినాఁడ
ధరణంబులేదును గుదగ్రుచ్చి మేన
వనమాలపేరుగావడిఁ బేర్చిదాల్చి
యానందలీలల నాడెడువాఁడ
గానని [3]నిప్పుడు మాఱుగలదెనాశక్తిఁ 270

[1] అనవుండు సూదిముఖుండతి గర్వమునను. [2] సాధిన. [3] యూప్పటు.

బరికించిచూడుము పవనజువలన
నాభయంబునులేక యతనివాలంబు
నవలీలగాఁగ నేనదరంటఁ బొడిచి
రయమునఁ జెండాడి రాజులఁదెత్తుఁ
గాదేని మరి నేలఁ గన్నంబువెట్టి
యెఱుఁగకుండఁగఁజొచ్చి యిన కులోత్తముల
నెఱయంగఁ గొనివచ్చి నిన్ను మెప్పింతు''
అనిభీకరములాడి యతఁడంతఁగదలె.

—: నూదిముఖుఁడు వాలంపుకోటదరిఁ జేరుట :—

కొమరొప్పవాలంపు కోటకుఁజేరి
యతిభయంకరమైన యాకోటఁజూచి
దాఁటిపోరాదని తనలోనవగచి
బయలుఁబొడిచినను బాహ్యమౌననుచు 280
నేలఁగన్నముఁబెట్టి నెఱివిచారించి
యరువదియోజనాలటఁ గ్రిందఁద్రవ్వి
పాలుపొందముక్కునఁ బొడిచెనాక్షణమె.

—: నూదిముఖుఁడు తన ముక్కును బోగొట్టుకొని మైరావణునితో మొఱవెట్టుకొనుట :—

పటుకున వాలంబు పొటుకునఁదాఁక
ముక్కువిరిగినవాఁడు మొఱవెట్టుకొనుచు
సురసుర స్రుక్కుచు సొంపెల్లఁబొలిసి
నెత్తురుగారంగ నేలవ్రాలుచునుఁ
బొలుపొందనానరభోజకు నెదుర

నిలిచిన నాతండు నివ్వెరగంది
చూచి మైరావణు నూదిముఖుతోడ
యిదియేమిచిత్రమో యిట్టి కార్యంబుఁ
జెప్పు[1] మెట్లన్ననుఁ జేరియంతయును
సొంపారవలికె నాసూదిముఖుండు
" నెఱిఘటికునిమాట నిక్కంబు దేవ !
కోటదగ్గఱపోయి కొమరొప్పఁజూచి
[2]వడి నెక్కఁబోయిన వజ్ర పంజరము
(నంబరమునదాఁట నలవిగాకున్నఁ)
(గరమర్థితో నేలఁ గన్నంబు పెట్టి)
(వరసతోడుత నఱువది యోజనములు)
త్రవ్వియాక్రిందట దర్పంబు మెఱసి 290
ముక్కునఁబొడిచిన ముదమొప్పవాయు
పుత్రువాలము తాకి పోయెనాముక్కు."
అనవిని రావణుండతివిస్మయమున
ఘూర్ణిల్లుముఖమునఁ గోపంబులెసఁగఁ
జింతించి చెక్కుటఁ జెయిఁజేర్చివాఁడు,

—: మైరావణుఁడుపాయాంతరములనాలోచించుట :—

ఏయుపాయంబుల నినకులోత్తములఁ
గొనిపోదునని మరికొంతచింతించి;
ఇదియేలఁగైకొంటిఁ సీతకై కంతుఁ
బనియేలఁగైకొంటిఁ బవననందనుని
నేగతినణఁగింతు నేమిసేయుదును "

[1]యేర్పడునన్న. [2]వడి నెక్కనలవిగాదా వజ్రపంజరము.

అనియిట్లు చింతించి యసురవల్లభుఁడు
తనమదిలోపలఁ దల్చె నొకమాయ.

—: మైరావణుఁడు విభీషణుని యాకారంబునుదాల్చి
కోటవద్ద కుఁజనుట :—

అరయ వారలఁబంపి యావిభీషణుని
యాకారమెఁతయు నలవడఁదాల్చి
[1]యందఱభేదింతు నపలీలగానఁ
[2]దక్కనదార్లు సాధ్యంబుగాదిపుడు
అనిబుద్ధిలోపల నటసంతసిల్లి
కపటవేషంబునఁ గరువలిసుతునిఁ
జేరంగఁజనుదెంచి చెలిమి[3]యొనర్చి
యత్యంతనియతితో ననెనొక్కమాట. 300

—: మైరావణుఁడు హనుమంతుని మోసగించుట :—

"రావయ్యపవనజ! రమ్యచారిత్ర!
అలరావణునిచేత నవమానమంది
లంకవెల్వడి వచ్చిరాఘవేశ్వరుని
శరణువేడిన వనచరులెల్లఁగూడి
యితనిఁగావఁగ నేరదితడురాక్షసుఁడు
వలదన్న, నావేళ వాయుతనూజ!
అభయమిప్పించిన యాత్మబంధుఁడవు
ఉపకారమునకుఁ బ్రత్యుపకారమేది
సేయంగఁదలఁచిన సృష్టిలోపలను

1 భేదపుట్టింతు మొండ్లొకటసేన. 2 తక్కనదాన గానసాధ్యంబు.... 3 పా. సరించి.

భాగ్యవంతుండని పలుకు[1]టఁజేత
నొనరంగఁజేసిన యుపకారమునకు
నెలమిఁ బ్రత్యుపకారమేఁ జేయఁగంటిఁ
దనర నేఁటుగాన ధన్యుండనైతి
వెలయంగ నామాట [2]వినవయ్య నీవు
ఒనరంగ నెగ్గుగా నూహింపవలదు
[3]నీయెడ బొంకను నిజమైనమాట,
ఎడరైన కార్యంబు నెఱిఁగింపకున్న
బంధుఁడు[4]వాఁడౌనే పగవాఁడు గాని
యీమహాకార్యంబు నెఱిఁగింపరాదు
కానఁజెప్పెద నొక్క కార్యంబు వినుము 310
నిన్నుఁ బిలుపించి నాడిన కులోత్తముఁడు
యేమికార్యమునకో యెఱుఁగము కాని
రామసౌమిత్రులు రాజులుగాన
నవుగాము లెఱుఁగక యాడుచుండుదురు
నిర్మలజ్ఞానివి నీయట్టివాఁడ
[5]దగునె కొండెములాడ ధర్మాత్మ నిన్ను
అనియిట్లు నీయెడ నాడినమాట
విందురు యవుగామి వివరంబులేక
కానరాజులకును గలదె ధర్మంబు
తుదనీవొకఘను[illegible] తొలఁగిన జాలు
నేఁబోయియాపని యిట్లుగాదనుచు
భానువంశజులకుఁ బరగంగఁజెప్పి

---

[1] దురుగాన. [2] వినవలశనేని. [3] నియ్యెడ బొంగక కనిజమునుగల్ల. [4] గాండకండు.
[5] తనరకొండెమునకు ధర్మరాజుండు.

మొనసినిర్ణిప్పిరంచి మేలుఁగైకొందు.”
అనవుఁడా హనుమంతుఁడాశ్చర్యమంది

—: హనుమంతుఁడు మైరావణుని వార్తలనువిని చింతించుట :—

యిదియేమిరాజులి [1]ట్లీలపంపుదురు
తలఁప నీకార్యంబుఁ దగవిభీషణుఁడు
నాకేలయెఱిఁగించు నరనాథవరులు
యేమిచింతించిరో యెట్లెఱుఁగవచ్చు
[2]కానిమాటలుఁజెప్పఁ గారణంబేమి.”
అనియిట్లుచింతించి యాత్మలోపలనుఁ  320
బవనతనూజుండు భయమునునొంది
తలవాలమప్పుడు తగనుజ్జగించి
కొనివచ్చియొకకొల్వు కూటంబుఁజొచ్చి
మదిలోన బెగడుచు మారుతాత్మజుఁడు
పరఁగంగ నాతపఃఫలమునెట్టిదియో
కాకరాజులకు నేగతిపుట్టగలదో
వినరానిమాటలు [3]వినివిస్మయమున
నూరకేపోరాదు యుర్విలోపలను
నీయభియోగంబు యేలసిద్ధించె”
అనియిట్లుమదిలోన నతిభీతిఁబొంది
తలపోయుచుండె నాతరుచరేశ్వరుఁడు

—: మైరావణుఁడు మాయాబలముచే దాశరథుల నపహరించుట:—

అంత మైరావణుండానందమొంది

---

[1] ట్లిల్ల షని........దురు. [2] (యనిరొని తనికి నాకిరంబు......చెప్ప కారణంబేమి)
[3] యాలవినివిస్మయొరుగ.

తనపని సిద్ధించెఁదడ వేటికనుచుఁ
గడఁగిరాజులుయున్న కడకేఁగుదెంచి
యాపథయుక్తుఁడై యల్లంతనున్న
సౌమిత్రిఁబొడగాంచి చతురుఁడై యవుడు
దవ్వులనిలుచుండి తనమాయ మెఱసి
దృష్టిబంధనములఁ దెఱఁగొప్పఁగట్టి
తనబంధనంబునఁ దానుబంధనముఁ
గదలకుండఁగఁగట్టి కాకుస్థకులుల 330
మదినొక్కవాకట్టు మంత్రయంత్రముల
ప్రాణబంధంబునఁ బరగనిద్దఱనుఁ
దరలకుంటఁగఁగట్టి తదనంతరంబు
నరయంగఁదనచేతికనువుగాఁజేసి
మఱియునచ్చోటన మంత్రణముచేసి
కరమర్థిసేనలో గలభఁబుట్టించి
యెనయంగరాజుల నెత్తుకఁబోయి
వనజనాళముఁజొచ్చి వలనొప్పనిలిచి
జలచరసుతుతోడ జయమని చెప్పి
చలమునజలనిధి సాధించిపోయి
కడఁగిలంకాపురిఁ గరమర్థిఁజొచ్చి
మహినొప్పనొకయుక్క మందసంబుననుఁ
జక్కగారాజుల జతనంబుఁజేసి
కొమరొప్పఁబాతాళగుహాలోనుదాఁచి
తననివాసముఁజొచ్చి తద్దయునుండె.
"సేననుననుడించి చింతింపకట్లు
హనుమంతుఁడెటుఁబోయె ననివిచారించి
యలరదిక్కులనెల్ల యార్పులివియేమి

యీ మొనలిదియేమి యీ మూకలేమి ''
అనుచుసుగ్రీవుండు నాశ్చర్యమందె. 340
అనయంబు పవనుజుండా రవంబులను
వినిమనంబున మహావిస్మయంబంది

—: హనుమంతుఁడు రాజులఁగానక చింతించుట ;
సుగ్రీవుఁడు హనుమంతుని మందలించుట :—

'' కపటరక్కసుండేమి కార్యంబుచేసె
నేనేలఁదొలఁగితి నేగతిమాలి ''
అనిభయంబుననొంది యాందోళపడుచు
మెల్లననే తేర; మిహిరనందనుఁడు
హనుమంతుఁబొడఁగని యతివేగవచ్చి
'' తగునయ్య! యిదియేమి తరుచరనాథ!
యెందుఁబోయితివిటు నిదినీకుఁదగునె
కటకటా! ధర్మమే! కరువలితనయ!
బుద్ధినిమఱసించి భూవల్లభులనుఁ
గానిపోయనోగాక కుటిలదానవుఁడు
వెలయనీపాటిల్ల వ్యర్థంబుగాదె
రావయ్యపోదము రాజులకడకు.''
అనుచుసుగ్రీవుండు నంజనీసుతుఁడు
మాటలాడుచు రాజమార్గంబుఁజేరి
పొలుపొందరాజుల పోకడఁజూచి
రవిసుతుడెంతయు రభసంబుతోడ
వాకిత్తి యేడ్వంగ వాయునందనుఁడు

—:హనుమంతుఁడు కోపముచే విభీషణునిపై నాగ్రహపడుట :—

కోపంబు వగవును గోరి[1] కింపొంద 350
నావిభీషణుఁబట్టి యదరంట వేసి
[2]వాలంబు మెడఁగట్టి వసుమతిమీఁద
నడఁచి[3] చంపెదననుచు న్నాగ్రహం[4]బొంద

—: సుగ్రీవుఁడు హనుమంతుని శాంతింపఁ జేయుట :—

వాలి[5]యనుజుఁడంత వడినందుఁ జొచ్చి
యందఱు వెరఁగంద హనుమంతుఁ జూచి
యనిలతనూభవ ! [6]ఆగ్రహంబునను
నీనిఁజంపఁగఁ బూననితఁడేమి చేసెఁ
బెనుపొందనీవర్ధిఁ బెంచిన చెట్టు
విఱిచివేయఁగ నీకు విహితమే చెపుమ
తనర నీవెఱుఁగని ధర్మంబుగలదె
[7]అవనిలో నీకిది యపకీర్తిగాదె
[8]తప్పనుఁదెలియకఁ దగునె యిటుసేయ ”
అనహనుమంతుఁడు [9]యర్కజుఁజూచి

—: హనుమంతుఁడు విభీషణునిఁ బలుతెఱంగుల నిందించుట :—

“ లంకవెల్వడివచ్చి రాఘవేశ్వరుని
(శరణువేఁడుచు వీఁడు సైన్యంబుఁగూడె)
వీని నమ్మఁగరాదు విడువుమీమాట ;
దనరంగ[10] నేఁడిట్లుదార్కొనవచ్చె

---

[1] పెనంగొనంగ. [2] వాలమున. [3] చెప్పద. [4] బునను, [5] తనూజుండు. [6] ఆగ్రహమౌను. యిలలోననిరెద్ది. [8] తప్పకాయనియాజ్ఞ. [9] అంగదు. [10] నెటిదిదార్కొన వచ్చు.

నాఁడునువీనికై నరనాథువరులఁ
బలుమాఱు వేఁడిన బలమెల్ల నాకు
నన్నియుఁడలకూడె నపకారమునకు 360
[1]దోషకారియుఁగొన్ని దుర్భాషలాడి
మిథ్యాపవాదంబు మేదినీశ్వరుల
[2]తలఁడడవుచుఁగొన్ని తగనాకుఁజెప్పి
బంధుకృత్యంబున భయముఁబుట్టించి
యుండకపొమ్మని యుక్తులుఁజెప్పి
కోమరొప్ప వాలంబు కోట[3]దింపించి
[4]నేఁడోలఁగఁగఁజూచి నీతికిఁబాసి
పగవారిఁగూడిన పాపకర్ముండు
రాణివాసద్రోహి రావణానుజుఁడు
కానఁజంపెద వీనిఁగరుణఁజేవిడిచి."

—:సుగ్రీవుఁడు విభీషణుని న్యాయవర్తనమును దెలియఁజెప్పుట:—

అనిన సుగ్రీవుండు హనుమంతుతోడఁ
"దనబ్రదుకుకోఱకుఁ దనవారిఁ బాసి
[5]సరగునరాజుల శరణనిచొచ్చి
మర్మములెఱిఁగించి మహియెల్ల నెఱుఁగఁ
[6]గూర్మిమనజయముఁ గోరెడువాఁడు
తలఁచునేద్రోహంబుఁ దలపోసిచూడ
[7]యెఱిఁగియుఁజేసిన నిందేలయుండు
నటుగాన వృత్తాంత మడిగెదనతని"
ననుచు దగ్గఱవచ్చి యావిభీషణుని

---

[1]అపకారమరికొన్ని దుర్భాషలాడి. [2]తలదవిడోక. [3]దిపించి. [4]నేనుతోలంగగ. [5]చెలువొంద. [6]గొమరొప్ప. [7]యెరుగక.

గనుఁగొని పలికె నాకపికులోత్తముఁడు 370

### —: సుగ్రీవుడు విభీషణునివలన మైరావణుని మాయల నెఱుంగుట :—

"యెసఁగ రాక్షసమాయ నెఱుఁగుదువీవు
మారుతియాడిన మాటలన్నియును
వింటివే పౌలస్త్య! విశదంబుగాను
నిట్టికార్యముమఱి యెవ్వఁడుసేయు"
ననినవిభీషణుండపుడిట్టులనియె,
"అపరంజ్యోతియే యైన రాఘవుని
పాదసేవకుఁడనై [1]బ్రదుకుటకొఱకు
[2]అరయనన్నుఁగూడ నటువీడివచ్చి
[3]సరగున రఘురాము శరణంబుఁజొచ్చి
యీపాపములుసేయ నిదినాకువశమె
యిందెయుండెదగాని యెందుఁబోయెదను
నిట్టికష్టపుచేత లేలచేసెదను
దొల్లి మైరావణుతోఁ జిన్ననాఁడు
కూడియుండఁగ మహాకుహకబుద్ధులను
నరయఁగా నేర్చె [4]వాఁడతియుక్తిశాలి
మాయవాఁడటుగాన మైరావణుండు
నారూపుఁగైకొని నమ్మించివచ్చి
యిట్లుసేయఁగ నాకునిన్నియువచ్చెఁ
బటుశక్తి రాజేంద్ర! పరఁగమాయావి
కొనిచనియనో కాక కొసరమిలేక

---

[1] బ్రతికెడికొఱకు. [2] అరయున్ని నిహపరసాధనంబనుచు. [3] చేకొని. వాడు లెసంతశాలి.

తనపాలిదైవంబుఁ దనపాలిగురువుఁ
దనపాలిటిస్వామిఁ దప్పనాడిననుఁ
దలవెక్క వ్రక్కలౌఁ [1]దరలు ప్రాణములు"
అనవుండు హనుమంతుఁడతనిమాటలకు
వినివిస్మయంబంది వివశుఁడై తెలిసి

—: హనుమంతుఁడు విభీషణుని మాటలనువిని వాపోవుట :—

అతిదుఃఖమును బొంది "హా"యని యేడ్చి
"యక్కట! రఘురామ! అవనీశతిలక!
పాపసంహారకా! పరమాత్మరామ!
వరబాణనిధిరామ! వనజాప్తరామ!
నీకిటు దుర్దశ నేఁడేల వచ్చెఁ
బరఁగఁబండ్రెండేండ్ల బాలప్రాయమునఁ
గౌశికుయాగంబుఁ గరమర్థిఁగాఁచి
తాటకినొకకోల ధరయెల్ల నెఱుఁగ
నేసిన రఘురామ! ఇనవంశతిలక!
తెఱఁగొప్పఁదపసిచే దీవనల్పొంది
జనకుని యింటికిఁ జతురుఁడై పోయి
జనపతులందఱు జయజయయనఁగ
హరువిల్లు విఱిచిన హా రామరామ!
వైదేహిఁ బెండ్లాడి వడినీవురాఁగఁ
బరశురాముఁడువచ్చి పవనవేగమున 390
[2]నడ్డగించినవేగ నతనిబాగణఁచి
యారూఢమైనట్టి యయోధ్యఁజొచ్చి

తొలఁగు. [2]అడ్డంబువచ్చిన అతనిమదముదీర్చి

పిన్నమ్మ కైకేయి ప్రియము లేకున్నఁ
దల్లి దండ్రులయాజ్ఞఁ దలమోచుకొనుచు,
నడవులకరుగుచు [1]నఖిలమునులకు
నభయంబులిచ్చిన హా రాఘవేంద్ర!
ఖరదూషణాదుల ఖండించినట్టి
ఓరాఘవేశ్వర! ఓరామచంద్ర!
నిర్మలసుజ్ఞాన! నిగమస్వరూప!
అరయంగఁదిమిరంబులణఁచినయట్టి
[2]రవికియుసహితమేర్పడిన చందమున
రాక్షసాంతకుఁడౌర! రణబలోద్ధామ!
పరమాత్మ! నీకునీపాటువాటిల్లె.
నేమని వగతు నేనేమి సేయుదును
నని పెక్కుభంగుల నావాయుసుతుఁడు
తలపోసి తలపోసి తద్దయువగచి
పోనాడితినె రామభూవర! నిన్ను
నెల్లరాణువతోడ నేర్పడనిలిచి
కరమర్థిఁ బోరాడఁగలఁడెయొండొకఁడు
నవనిజతోడ మాటాడినయట్టి 400
మాటలబీరంబు మడిసె నన్నియునుఁ
గామరొప్పరావణుకోర్కెసిద్ధించె"

—: అంగదాదులు హనుమంతునకు ధైర్యముఁ జెప్పుట :—

నని యని పలుమాఱు నలయుచుండఁగను
నంగదాదులు వచ్చి యనిలజునెత్తి

1 అఖిలమునివరుల. [2] రవికిహీనుంబు మార్పడినచందమున. [3] దుదిశ.

యేల వగతువయ్య యితరునిభంగి
వగచుటకార్యమే వాయుతనూజ !
నీవిట్లు వగచిన నిందెవ్వరైనఁ
జలపాసి చూచిన దక్షులున్నారె
నీవింతవగతువే నిజశక్తి నెఱసి
రామచంద్రులఁ జూడ రణభూమియందు
నీవెకార్యంబులు నిలువఁబెట్టితివి
పరఁగ వానరసేనప్రాణమెత్తితివి
తరుచరసేనకుఁ ద్రాతవునీవు
యీలంక మార్గంబు లీవెఱుంగుదువు
పోలుపొందరాజులపోకడ వినినఁ
బలుదెఱంగుల సేనభగ్నమైపోవు
భానుండులేని భూపట్టంబుకరణిఁ
జంద్రోదయము లేని శార్వరిభంగిఁ
బతిలేనిసతిభంగి ; పార్థివరహిత
మైనసుఁ గార్యంబుల ట్లుండగాను
జెలఁగివారధి దాఁటిసీత నమ్మించి
తెఱఁగొప్ప సేనలఁదెచ్చి చేర్పించి
మాయల మాటల మరికోలుపోయి
తావ్యర్థమైపోయెఁదరుచరేశ్వరుఁడు
అనినిన్నుఁబలుకుదురఖలదేశములఁ
బోరిబోరిజానకి పొలియునంతంత ”
అనిప్రియమొనరింప నావాయుసుతుఁడుఁ
దెలిసియంతటలేచి ధీరుఁడై నిలిచి
“ నాకుమోసము[1] లేదె ననుమోసపుచ్చి

[1] గలదె.

యుండక పొమ్మని యుక్తులఁజెప్పి
క్రూరుఁడై రాజులఁ గొంపోయినాఁడు
నేవానిఁజంపెద నిజశక్తిమెఱసి
కొండలలోడాఁగి గుహలఁజొచ్చినను
నమరఁబాతాళంబు నందుకేఁగినను
నరయ నాకాశంబు నకునైనఁబోయి
మఱియుబ్రహ్మాదుల 'మఱుగుఁజొచ్చిననుఁ
బ్రాభవంబున వానిఁబట్టి ఖండింతుఁ
గాదేనిజగములఁ గరములఁబట్టి
ధీరతనొకచీర తెరనెత్తినట్లు
బెకలింతుఁ ద్రిదశులు భీతిల్లి వణఁక　　420
నక్షత్రములు క్రుంగ నగములుఁ గ్రుంగఁ
బెడచేత మిన్నొక్క మెట్టునఁజఱతుఁ
జెలఁగి బ్రహ్మాండముల్ చెల్లఁబోరాడి
తెత్తు రాజులనెన్ని తెఱఁగులనైన
మఱినాకసాధ్యంబు మహిలోనఁగలదె"
అనితనమదిలోన నాటోపముననుఁ
బవనతనూజుఁడు బాహాస్ఫాళించి
"కఱకురాక్షస మాయ కానంగరాదు
[1]యాపురికినిద్రోవ యదియెందుఁబోవు
నెరయవిభీషణ ! నీవెఱుంగుదువు
పౌలస్త్య ! చెప్పుమాపరఁగంగనాకు"
ననిగారవంబున[2]నందనాసుతుఁడు
[3]అడుగ విభీషణుఁడాతనిఁజూచి

---

[1] ఆపురమునకుత్రోవ. [2] నతనిగారవించి. [3] అడిగిన.

—: విభీషణుడు హనుమంతునకుఁ బాతాళలంకకుఁ బోవు మార్గమును జెప్పుట :—

"కొమరొప్పనల్ల దే కొలనులోపలను
నలువొంద[1] శీతవనజములు రెండు
నలువొప్పనున్న నానాళంబుఁ జొచ్చి
పోవయ్య లంకకు భువనైకవీర !"
అనవుండు హనుమంతుఁ డానాళవీథిఁ
జనఁ జొచ్చెనటఁ బోయి చనిచని యెదురఁ
గనియెనుగ్రాకారు ఘనబాహుబలుని   430
వాఁడంత ఘర్జించె వారధుల్ కలఁగ
నతిభయంకరముగా నట్టహాసంబుఁ
జేసిన మారుతి చెదఱకపోవ

—: మత్స్యవల్లభ మరుత్సుతుల యుద్ధము :—

"ఎందుఁబోయెదవోరి ! యింక నా యెదుటఁ
జిక్కితి" వనవుఁడు చిరునవ్వు నవ్వి
కరువలిపుత్రుండు కైకొని వానిఁ
బెడచేత వేసిన భీతిల్లి [3]మిగులఁ
దెలిసి వాఁడప్పుడు ధీరుఁడై నిలిచి
వలనొప్ప హనుమంతు వక్షంబుఁ బొడిచె,
వాయునందనుడంత వాలంబుఁ జాఁచి
పెట్టుకొన్నంతట భీతిల్లి యతఁడు
తనర హనూమంతుఁ దనువు నొప్పింప
నాగ్రహంబున వాని నదరంటఁ బట్టి

[1] శీతల జలములు. [2] కొంకక పోవ. [3] మగ్గి.

వేసినవాఁడంత వివశుండుగాఁగ
నంజనీసుతు దేహ మలమి పట్టుటయు
వానిహస్తంబును వడిఁద్రోసెనంత
ద్రోబ్బినవాఁడంత దొలఁగకసలి వి
హోరాడిరిద్దఱు భువనంబుగ్రుంగఁ
బాతాళలోకంబు బలువడిఁగలఁగ
[1]శీతాంశుభానులు చీకాకుపడఁగ 440
మలఁగక నక్షత్రమండలి వణఁక
నష్టదిగ్గజములు నతిభీతినొంద
నిరువురుఁడమలోన నిట్టుబోరాడ
నలయకమదిలోన హనుమంతుడంత

—: హనుమంతుఁడు మత్స్యవల్లభుని పరాక్రమమునకు నాశ్చర్యపడుట :—

నాతనిభుజశక్తి కాశ్చర్యమంది ;
" చలముననాతోడ సరిఁబోరెనితఁడు
[2]వీఁడెవ్వఁడో వీని వృత్తాంతమెల్ల
[3]నరయకపోరుట యదిబుద్ధిగాదు
కణఁగి ముందట రాచకార్యంబుకలదు "
అని నిశ్చయముఁజేసి యతనితోననియె.

—: హనుమంతుఁడు మత్స్యవల్లభుని వృత్తాంతమడుగుట :—

—: [4]రావోయి ! నాతోడ రభసంబుమెఱసి

---

[1]చంద్ర సూర్యులు. [2]వీఁడెవ్వఁడోగాక వృత్తాంతమెఱిగి. [3]అలయక. [4]రారోయి.

[1]యేకాంగివై పోర నేమికారణము
యెవ్వని బంటవు యేదినీపురము
తనరంగ నీతల్లిదండ్రులెవ్వారు
నీపేరుఁజెప్పుమా [2]నిజముగామాకు"
నన జలచరసూనుఁడనిలనందనునిఁ
గనుఁగొని పలికెను [3]గర్వంబుమెఱసి
"పేరును బురమును బేర్కొ[4]యడుగ
సమయమా యీవేళ సమరంబులోన"
ననిన నాహనుమంతుఁడతనిమాటలకు 450
వెలయంగ మదిలోన విస్మయంబంది
"ఎదురుతన్నెఱుఁగక యేకాంగియిట్లు
దగఁబోరుటయు వీరధర్మంబుగాదు,
అటుగాన నొకమాట కమరనుత్తరముఁ
గరమర్థితోఁ జెప్పు కపటంబు మాని"
యనవుండు వినినవ్వి హనుమంతుతోడ
మనమారఁబలికె నామత్స్యవల్లభుఁడు

—: మత్స్యవల్లభుఁడు తన జన్మవృత్తాంతముఁ జెప్పుట :—

"వినవయ్య నాకథ వృత్తాంతమెల్లఁ
బొలుపొంద నావాయుపుత్త్రుఁడైనట్టి
హనుమంతుఁ[1]డనఘాత్ముఁ డరయమాతండ్రి
[5]తెఱఁగొప్ప జలచర తిమియు మాతల్లి
పాతాళలంకకుఁ బతియైనవాఁడు
మహ్మైలునాతఁడు మైరావణుండు

---

[1]యో...గి. [2]నిత్యంబు. [3]మార్గంబు. [4]దనకు...డ. [5]చెలువొందతిమియును జలచరమాతల్లి.

వలనొప్పనను మత్స్య వల్లభుఁ డద్రు
హనుమంతు పుత్రుండనటుగాననన్నుఁ
గెలువకపోరాదు గెలిచిన పిదప
నీవునీదెస కేఁగు నిఖిలైకవీర !
అనవుండు హనుమంతుఁ డాశ్చర్యమంది
" వాయుజుఁడేయూరు వనితయేయూరు
పొలుపొంద హనుమంతు పుత్రుండనుచు
బొంకుచున్నాఁడవు పొసఁగదీమాట
పరఁగ [1]వాయుసుతుఁడు పటుబ్రహ్మచారి
[2]కలదె బొంకితివిట్లు గపటమార్గమున "
(ననవినియతఁడంత హనుమంతుకనియె)
" బొంకనా కేటికి పొలుపొందనాదు
జన్మప్రకారంబు[3]సరసతవినుము
శ్రీరాము పంపునఁ జెలఁగివాయుజుఁడు.
వెలయంగజానకి వెదకేటికొఱకు
పొలుపొందలంకకుఁ బోయేటియపుడు      460
[4]చెలఁగియంబుధిదాఁటఁ జమటక్రమ్మఁగను
[5]నరయఁజెమటఁబుచ్చి యంబుధిక్రైవఁ
దిమియనుమీనంబు తెలఁగొప్ప[6]మింగె,
మింగిన[7]మీనంబు మేలుకడుపున
మనమారఁబుట్టిన మత్స్యవల్లభుఁడ
నేనీని పంపున నిందున్నవాఁడ
ననహనుమంతుండు నాత్మలోపలను
వానిమాటకును వడిసంతసిల్లి

---

[1]హనుమంతుఁడు బ్రహ్మచార్యుండు. [2]కలరెబొంకితివికొన. [3]చెప్పద. [4]జలనిధిదాటంగ. [5]అరయంగనిధిపుచ్చి. [6]మ్రింగఁగ. [7]గర్భంబుమీను.

తనసుతుఁడౌ టెఱిఁగి తరుచరేశ్వరుఁడు
కరమర్థివానిపైఁ గారుణ్యదృష్టిఁ
బఱపెనుగడుఁగృపా పారీణుఁడగుచు 470
"నేహనూమంతుండ నీవునావలన
జన్మించితదిగాన సంతోషమయ్యెఁ
జెలువొందనాపని నేయనోపుదువె"
యనవుండునాతండు నతిసంతసమునఁ
[1]జయ్యన భక్తితో సాష్టాంగమెఱఁగె,
ముకుళితహస్తుఁడై ముందటనున్న
మత్స్యవల్లభుఁజూచి మారుతాత్మజుఁడు
కడఁగి[2]సంప్రీతినిఁగౌఁగిటఁజేర్చి
తెఱఁగొప్ప నతనికి దీవెనలిచ్చె,
తనర వేడుకనున్న తండ్రినిఁజూచి
[3]మత్స్యవల్లభుఁడంత మనమారఁబలికె,
"చెప్పు డేపనినైన నేయనోపుదును"
ననవుండు హనుమంతుఁడా పుత్రుఁజూచి
కణఁగిముందట రాచకార్యంబుకలదు
కాననేఁబోయెదఁగడఁగి రాక్షసుఁడు
మాబుద్ధిఁదప్పించిమము మోసపుచ్చి
యొసఁగంగరాజుల నెత్తుకఁబోయె
[4]నేయుక్తిచేనైననసే వానిఁజంపి
తెఱఁగొప్పరాజులఁ[5]దెచ్చుటకొఱకుఁ
బోవుచున్నాఁడను బొలుపొందనాకు
మర్మంబుజెప్పుమా మత్స్యవల్లభుఁడ !

---

1 జెలువొంద. 2 సద్భక్తిమై. 3 తామసయుక్తుండై చెలువొందతలుగా. 4 యెయ్యుపాయంబునయొ. 5 దెచ్చుదననుదు.

అనవిని హనుమంతుకాతఁడిట్లనియె
[1]సమరోత్సాహుండును సాహసికుండు
కపటవిద్యలయందు ఘనమైనవాఁడు
అరయనాతనిపురి యజునకునైన
నూరకపోరాదు ఉడురాజుకైన
నెసఁగనీవాపుర మెట్లుఁజొచ్చెదవు"
[2]అదినీకుఁజెప్పితి నతిదుర్గమంబుఁ
జనిచొచ్చి పోవను [3]జతనంబుగాదు
యేపారనాత్రోవయిదె [4]పొమ్మునీవు
చెలగినీపని యెల్లసిద్ధిఁ బొందెడిని
పొలుపొందగామతి [5]పోవుచోనవుడు
తరుచరేశ్వరనన్ను దలఁచు[6]ముపత్తు"
ననుచు[7]యుక్తులుఁజెప్పి యతివేగముననుఁ
జెలువొందఁజనియె నాజలచరసుతుఁడు

—: మైరావణుఁడు రామలక్ష్మణులను గాళికిబలియివ్వఁ ప్రయత్నించుట :—

అక్కడ దనుజేశుఁడతిసత్వమునను
నామహారాజుల నామహాశక్తి
కరయఁగ బలియివ్వ [8]నాగ్రహంబెసఁగ
[9]నెరయంగఁగ్రొత్తగా నీళ్లుతేవలయు
నన్యులకెఱుఁగింపుటది బుద్ధిగాదు
ననుచుసహోదరి యతివదోర్దండిఁ

---

[1]సమరోత్సవుండుశాహసకృత్యుండు. [2]అనిచెప్పి త్రోవయతి దుర్గంబు. [3]సమ్మతముకాదు. [4]గానియందు. [5]పోయెయవుడు. [6]వచ్చెదను. [7]బుద్ధులు. [8]ననికాద్రమెసంగ. [9]నెరయునదిలోత్స.

బిలిపించి వేడ్కతోఁ బ్రియమొనరించి
తనపూర్వవైరంబుఁదలపోయకతఁడు
చెలువొంద మర్మంబుఁజెప్పినాసతికి
రామలక్ష్మణులను రాజనందనుల
భద్రకాళికి నేఁడు బలిసేయవలయు
[1]నెరయఁగాఁగొత్తఁగా నీళ్లుతెమ్మనుచుఁ
[2]బంపినఁ జనవిధి పంపినయట్లు
బంపిననాయింతి పనిబూనియరుగ
వెలువడిపురవిధి వేగనే తెంచి
ముదమొప్ప మొగసాల ముందట నున్న
కరమొప్ప [4]నొకత్రాసు గ్రక్కున నెక్కి
యాపురద్వారంబు [5]నంతటవిడచి
పరఁగ నల్దిక్కులు పరికించి చూచి

—: మైరావణుని చేతలకు దోర్దండి వగచుట :—

యతఁడుచేసిన చేతకాత్మలోవగచి
[6]కన్నీళ్లుకారంగఁ గాంతచెక్కిటను
"వీఁడేలగర్వించె వీనిరాజ్యంబు
పోవలయునో కాక భోగంబులకట!
ఆసభామందిర మణఁగెనో కాక
వడినంత్యకాలంబు వచ్చెనో కాక 500
కాకున్న నేఁడేల కమలాప్తకులుల
బొలుపొందనిటుఁ జంపు బుద్ధేలపుట్టు
కపటవిద్యలచేతఘనుల నిద్దఱిని

[1] నెరయునదిలో క్రొత్త నీళ్లుదెమ్మనుచు. [2] పెంపునత. [3] త్రాసు. [4] నా త్రాసు.
[5] యపుడు వెడలి. [6] నిలిపి కన్నీళ్లు కాంతచెక్కిటను.

నణఁగించఁ దెచ్చెనో యనదలఁజేసి
[1]యీ రాజపుత్రులకిట మరణంబు
అక్కట! కానోవునది నిశ్చయంబు
గాక రాఘవులకుఁ గలదె మరణము
వాయునందనుఁడును వనజాప్తకులుల
వెదకంగ రాఁజేల వెలయ [2]నీపట్లు"
ననియిట్లు బలుకుచు నశరీరివోలె
యేటికిఁబోవుచు నిట్లని పలికె,
"ఇట్టి మహాత్ములకిట్టి దుర్దశలు
వాటిల్లుచున్నవి పరులెంతవారు
పొలుపొందనీ[4]రేడు భువనంబులెల్లఁ
బాలింపుచున్నట్టి భానువంశజుల
దీనులుగాఁజేసి తెచ్చినాడితఁడు
కరకురక్కసు మాయఁగానంగరాదు
యెఱుఁగంగఁబోరాదు యినకులోత్తములఁ
దెఱఁగొప్ప వెదకంగ దిక్కులేదయ్యో
నెరయ నీవిధి గెల్వ నెవ్వరి[5]కైనఁ
దరముగాదను మాట తథ్యంబు నేఁడు
యిఁకమీఁద రాజులకెవ్వరు దిక్కు
తనసుతునకు దిక్కు తగమాలినట్లు
మనువంశజులు దిక్కుమాలిరో ౘడు"

—: అంజనేయుఁడు దోర్దండిని సంధించి రామలక్ష్మణుల వృత్తాంతమునుఁజెప్పి తన నిజరూపమునుఁ జూపి నమ్మించుట —

అనియిట్టుపలుకుచు హా! యనియేడ్చి

---

[1] యీ రామలక్ష్మణుల. [2] నిట్లనుచు. [3] పాటింపుచున్నవి. [4] నీకిటు. [5] వశమా.

దైవంబుఁదూఱుచు దగ్గఱవచ్చు
నాసమయంబున నంజనీసుతుఁడు
తరుణిమాటలువిని తాసంతసిల్లి
దగ్గఱవచ్చి యాతరుణికిట్లనియె
" నింతిరో ! ఒకమాటయిప్పుడేమంటి
మహీపతులకు దిక్కుమాలెపొమ్మంటి
నీసుతునకు దిక్కు నేరయలేదంటి
నెరయరాజులకును సీతనూజునకు
దిక్కునేనే నమ్మి దివిజులుసాక్షి
వారెవ్వరెఱుఁగింపు వనజాక్షి ! నీవు."
అనవుండు దోర్దండి యతనివీక్షించి
" ఎందుండి వచ్చితి వెవ్వఁడవీవు
[illegible]ందులకే తేరనేమిగారణము
కోతిరూపులవారు కుశలవాక్యముల
నేనోటఁ బలుకుదురిదికొత్త నాకు 520
నీవెవ్వఁడవు సురి నీకుఁబేరేమి
యెవ్వనిపనిబూని యిటకువచ్చితివి
యెఱుఁగింపు" మనవుఁడు యాతెఱంగెల్లఁ
జెప్పిన దోర్దండి చిత్తంబునలర
" నింతిరో ! వినవమ్మ యినకులోత్తముల
మాయలనణఁగించి మైరావణుండు
కొనివచ్చియున్నాఁడు కువలయేశ్వరుల
నరయవచ్చితి నేను నంజనీసుతుఁడ
నతివరో ! నాపేరు హనుమంతుఁడండ్రు "
అనవుండు దోర్దండి యతిసంభ్రమమున
" వానరోత్తమ ! నీవు వాయునందనుఁడ

వనుమాట నేనమ్మ నలరనీరూపుఁ
జూపవే యనవుండు సొంపుదీపింప
హనుమంతుఁడెంతయు నాకాశమెల్లఁ
బెరిగిచుక్కలు మొల[1]పేరులుగాఁగఁ
బ్రియమంది దోర్దండి పేర్మియట్లున్న
హనుమంతుఁగొనియాడి యాత్మలోనమ్మి
మఱియుముప్పదిరెండు [2]మణుగుల బరువు
పెంపారఁదనకాలఁ బెట్టినయట్టి
సంకెల బరువుకు [3]సైఁపక యింతి 580
[4]బ్రతిమాలిదానిని భగ్నంబుఁజేయు
మనవుండు హనుమంతుఁడా సంకెలపుడు
వామహస్తంబున వడినుగ్గుజేసి
వనితతో నిట్లనె వాయునందనుఁడు
"నీపతిపేరేమి నీకుఁబేరేమి
నీనత్తికడవేమి నీసంకెలేమి
నీసుతునకునైన నిర్బంధమేమి
చెప్పుమేర్పడనన్న శ్రీరామదూతఁ
గనుఁగొని రాక్షసకాంత యిట్లనియె.

—: దోర్దండి హనుమంతునకుఁ దనవృత్తాంతమును దెల్పుట :—

వినువాయునందన! విశదంబుగాఁగఁ
జెలఁగిమైరావణు [5]చెల్లెలు నేను
(దోర్దండినాపేరు దుర్వారశౌర్య!)
కరమర్థినాపతి కాలదత్తుండు

---

[1] పూసలు. [2] మణుగులబరువు. [3] జాలక. [4] ప్రాలుపొందయిదిబిరిచి పొవెయవయ్య.
[5] చెలియదోర్దండి.

[1]తనరంగమాయందు దైవంబు కృపను
సుతుఁడొకఁడు జనించె సూర్యసన్నిభుఁడు
నీలమేఘుండను నిత్యశౌర్యుండు,
మైరావణునకును మాతంగివలన
నుదయించె నొకకన్య యుత్పలనేత్రి
వలనొప్పఁగా రూపవతియనుపేర
నది వుట్టినప్పుడే యశరీరి పలికె 540
"వలనొప్పనీయింతి వరియించినట్టి
యాతఁడే యీలంకకధిపతి యనుచు
నీలమేఘునకును నీరూపవతికి
బ్రహ్మసంఘట్టన పరఁగఁగనిజము"
అని చెప్పి యశరీరి యడఁగెనంత
మనమునఁ బెగడొంది మైరావణుండు
నంతకాకారుఁడై యాగ్రహంబునను
గోపించియప్పుడు కొలువులోనున్న
[2]సుతునకు సంకెలు జోడించెనపుడు
సుతుకాళ్ల సంకెలఁ జూడంగలేక
చెప్పితిఁబ్రియములఁ జెలువార నేను
తోడఁబుట్టిననన్ను దుష్టుఁడై వాఁడు
కోపించిసంకెలఁ గొమరొప్పఁబెట్టి
కడవఁ జేతికినిచ్చి కష్టమార్గమునఁ
బనిపంపు [3]సేయించుఁ బవనతనూజ!
నీవు ధర్మాత్ముఁడా నీతిమంతుఁడవు
నినుఁజూచినప్పుడే నిఖిలైకవీర!

---

[1] తమయిరువురువలన. [2] కాంతుని పట్టనకడిది కోపమున ధృతి బాసి తెగజూచి తివిరి యున్నంత. [3] సేయుండు.

పరఁగంగ నాతపః ఫలమెల్లఁబండె
సంతోషమయ్యె నో శాఖామృగేంద్ర !"
అనవుండు పవనజుండా యింతిఁజూచి

—: హనుమంతుఁడు దోర్దండిని సమాశ్వాసపఱచి
మైరావణునిగుఱించి వివరములనడుగుట :—

నీవేల వెఱచెదు నీపుత్రుఁదెచ్చి 550
పాతాళలంకకుఁ బట్టంబుఁగట్టి
పెంపారనాయింతిఁ బెండ్లి సేయింతు
మత్తుఁడై యున్నట్టి మైరావణేశు
జంపుదు దివిజులు సంతోషమంద
రాజులఁగొని తెత్తురభసంబు మెఱయ
నివి నిశ్చయంబని యింతిరో! నమ్మ
మనుచు ధైర్యముఁజెప్పి హనుమంతుఁడవుడు
"సతివరో! యొకమాట అరమరలేక
చెప్పుమాయడిగెద సిద్ధంబుగాను
సఖియరో! దనుజునిసమయ[1]ముఁజెప్పుము
మఱియును దక్కిన మంత్రులెవ్వారు
యెవ్వరెవ్వరు వానికిష్ట కృత్యములఁ
జరియించువారల సరగునఁజెప్పు"
మనవుండు హనుమంతు కనియెదోర్దండి

—: దోర్దండి మైరావణుని వృత్తాంతమును
హనుమంతున కెఱుకపఱచుట :—

"పరఁగ నాతఁడు మహాప్రాణుండుతలఁప

---

[1] మెరుగింపు. [2] చెప్పుమా నాకు.

నతవిప్రాణంబు వింధ్యాద్రిపైనుండు
నేడువాకిళ్లతో నెసఁగుచునుండుఁ
బాషాణముననుండు భ్రమరంబులేదు
నొండొంటిఁ[1]జూడక యొగిఁజొచ్చి వెడలు
నరుదుగానందులో నరుగుచునుండుఁ 560
బెనఁగకుండఁగఁబట్టి పెనచి[2]యోడించి
యొక్కటఁజంపక యుద్ధంబులోనఁ
జావులేదనుమాట సత్యంబునమ్ము
మదిగాక మంత్రులు నతిబలాఢ్యులను
నేవురఁజంపక యేర్పడఁడతఁడు
నీకెదురెవ్వరు నిఖిలైకవీర!
యిట్టి బలాఢ్యుండు ఈరావణుండు
పవనజ! చూచితె పాతాళలంక
రత్నగోపురములు రమణీయమైన
బంగారుమేడలు భద్రశాలలును
రవిసోమవీథుల రంజిల్లుచుండు
వనములు చెఱువులు వనజాకరములుఁ
గేళీగృహంబులు గజశాలలమర
బహురత్నములతోడఁ బ్రబలమైయున్న
వాణిజ్యగృహములు వలనొప్పుచున్న
కోటలు తొమ్మిది కొమరుదీపింపఁ
గనకంపుకోటయు [3]ఘనమైనవెండి
రాగికోటలు పుక్కరాతికోటలును
నిటికకోటయు మఱియునుకకోటయును
[4]నింపులుఁ జెన్నొందు యిత్తళికోట 570

కూడకయొగి. [2]యొట్టించి. [3]గావెండికోట. [4]యింతయుచెన్నొందు.

ముక్కంటి మెచ్చిన ముత్యాలకోట
పగడంపుకోటయు [1]పరఁగంగనచట
మిన్నులతోనంటు మెఱుఁగుక్కై వడిని
కోటకన్నొక్కొక్క కోటిరాక్షసులు
ఘనబలులెప్పుడు కాఁచియుండుదురు
అట్టికోటలుదాఁటి యరుగంగవలయు
వనచరరూపుని వారు [2]పోనీరు
తొరగాఁగఁద్రాసుచు ద్రొక్కిపోవలయు
నవుగాన వేరొక్కయాకృతి దాల్చు"

—: హనుమంతుఁడు ముంగిసరూపమును దాల్చి పాతాళలంకను బ్రవేసించుట :—

మనవుండు హనుమంతుఁడతి సూక్ష్మమైన
ముంగిసరూపంబు ముదమెప్పఁదాల్చి
కనకపు[3]ఘటములోఁ గరమర్థినుండెఁ
గలశంబు శిరమునఁ గరమర్థిఁ బెట్టి
పాలుపొంద దోర్దండి పురమువాకిటకుఁ
జనుదెంచి యాత్రాసుఁ జయ్యనఁద్రొక్కెఁ
ద్రొక్కనయాత్రాసు తోడనేమెగసె
వాకిటికావలివాఁడుగ్రుఁడయ్యె
నతివేగ బెగడకుమని సాహసమునఁ
[4]గపిరాజువానిచేఖడ్గంబుఁబుచ్చి
కొనిద్రేవేయవాఁడంత గుంభినిఁగూలె
రక్తాక్షుఁడిలఁగూల రమణిసంతోష
[5]కారణు హనుమంతుఁ గనుఁగొనిపలికె

[1] పరగినయట్టి. [2] చొరనీరు. [3] కలశంబులో. [4] కడునలి. [5] కరమున.

—: మారుతి మైరావణుని మంత్రులను జంపుట :—

" మారుతీ ! వినవయ్య మంత్రులమున్న
చంపక యేపనిసాధ్యంబుగాదు
అనుచు నాదోర్దండి యతివేగమునను
మనమార ఘటికుని మాళిగఁజూపె
నతనిమర్దించిన హనుమంతుఁడంత
[1]నెసఁగసూదిముఖుని నిలుఁజూపుటయును
దర్పించివానినుద్ధతి వ్రేసెనంత
సురసుర ముక్కుచు సూదిముఖుండు
వడవడవణఁకుచు వనచరుఁజూచి
వినవయ్య యిప్పుడు వీరపుంగవుఁడ !
వలనొప్ప హనుమంతు వాలంపుకోట
మారాజు పంపున [2]మన్నీలకోఁటకు
గర్వించి పొడిచిన ఘనమైన ముక్కు
[3]ఁ ఱిగినతోడనే వేగవచ్చితిని
పాఁసినబంటను పంతమా చంప "
అనవుండు వాయుజుండతనిమన్నించి
మఱియును గలయట్టి మంత్రులయిండ్లు
దోర్దండి చూపినఁ దొరకొనిచంపె 590
నంతదోర్దండితో హనుమంతుడనియె

—: హనుమంతుఁడుదోర్దండిసుతుఁడగు నీలమేఘునకు ధైర్యముఁ
జెప్పి రామలక్ష్మణులను గలిసికొనుట :—

" రాజులెందున్నారు రమణి ! నీసుతునిఁ
జూపుమా యనవుండు సుదతికొంపోయి

---

[1] యెువున. [2] మహీపతులకోఁటకు. [3] విరిగినతనకి తిరిగివచ్చితిని.

కారాగృహంబున గాసిలియున్న
తనతనూజునిఁ (జూప) దండివిక్రమునిఁ
[1]గామరొప్ప నీలమేఘుఁడు చూచిపలికె
“ ఇది యేమి [2]ఓతల్లి! యీకపీశ్వరుఁడు
యెందుండి వచ్చెనో యిటకేలవచ్చె
[3]సహియింపరాని నీసంకెలయేది
అని బెగడినఁ జూచి యతివయిట్లనియె,
“ మనభాగ్యవశమున మనలరక్షింప
వచ్చినశూరుండు వనచరోత్తముఁడు
తలఁకనేటికి నీవు తరుచరేశ్వరుని
పాదపద్మములకు భక్తితోమ్రొక్కు ”
మనవుండు చనుదెంచి యానీలమేఘుఁ
డతిభక్తితో [4]మ్రొక్కననియె వాయుజుఁడు
“ [5]నీవేల వెఱచెదు నీకు నేనండ
పరఁగ నీపురికిని బట్టంబుగట్టి
మైరావణునినైన మదమణంగింతు ”
ననుచువిశ్వాసంబు నతనికిఁగొల్పి                    600
“ పొలుపుగావాఁడునీ [6]బాడఁగనె నేని
[7]మన్నించఁదూరకే మార్గంబులేదు
కానయుద్ధంబునఁగానరాకుండ
నేపారదొలగుము [8]యెచ్చటికైనఁ
గాదేని మర్మంబుగలిగినఁజెప్పు
మనివానిఁదోడ్కొని యవనీశ్వరులను

చూపుట. [2]దోర్దండి. [3]సఖియరాని కాలిసంకెలయేది. [4]నిజహస్తములెత్తి మోగిచి. [5]తనీకకమరియున్న తనిమాపాయుజుండు. బాగడనేని. [7]మన్నించినూరకేరి పైపైన. [8]యెడకైచాట.

దోర్దండి చెప్పినతోరంపు వేడ్కఁ
[1]గనియుక్కు పెట్టెను గరమునఁదాల్చి
వెలుపలఁగొనిపోయి వెలయంగమిమ్ముఁ
గొమరొప్ప నొకకొండగుహాలోనదాచి
మనసు[2]లెస్సగలేక మహివర ! మీరు
యెట్లున్నవారకో యీమందసమున
నిశిచరమాయల నెట్లున్నవారో
[3]తోపదుమదిని సంతోషంబులేక
మందక[4]మంతట మఱియును దెలిచి
దనుజమాయలచేతఁ దగిలి మీరందు
నలసి నింద్రించెడి యాచందమునను
మెల్ల నేడగ్గరి మేలుకొల్పుటయుఁ
దెలిసి హనుమంతునిఁ దెఱఁగొప్పఁజూచి
("యిదియేమి పవనజ ! యిటకురా మనకుఁ)
(గారణమేమని " కణఁగిపల్కుటయు)
("మైరావణుండను మనుజాశనుండు)
(తెఱఁగొప్పమిమ్మిటఁ దెచ్చినవాఁడు)
వానిమర్దించెద వలనొప్పఁబోయి "

—: హనుమంతుఁడు మైరావణుని జంపుటకై పాతాళలంకనుఁ బ్రవేశించుట :—

అనిపల్కుటయు జయమనుచు దీవించి
మరిమీరుదనుజుని మాయసత్వమున
నిద్రఁగప్పినఁజూచి నిఖిలధర్మాత్మ

---

[1]మందహాసాకారంబుదాల్చి. [2]వగలేక. [3]చూడక మనసుసంతోషంబుగాదు.
[4]సంబటుగాన.

కీపాటువాటిల్లె నేమనవచ్చు
ననివిధి దూఱుచు నరుగుచోఁ దనదు
వాలరోమంబులు [1]వాఁడిగాఁ జేసి
పరువడి [2]పెట్టెను బదిలంబుచేసి
కరువలిపుత్రుండు కడునుగ్రుఁడగుచుఁ
దివిరియాపురమంత ధీరుఁడై చొచ్చె.

—: హనుమంతుఁడు పాతాళలంకఁ జొచ్చుటయు
సూదిముఖుఁడు మైరావణున కెఱుకపఱచుట :—

అటమున్న లంకలో నీవార్తఁ [3]దెలిసి
[4]సూదిముఖుండంతఁ జూచి రావణుని
మొగసాలముందఱ మొఱవెట్టుకొనుచు
" దేవ ! నేఁడొకకోతి తెగువమై వచ్చి
రక్తాక్షుఁ బోఁగొని రభసంబు మెఱసి
మంత్రులనందఱ మడియించి పిదపఁ
గ్రూరుఁడై పురములోఁ [5]గ్రొవ్వియున్నాఁడు 620
దేవదానవులకు దృష్టింపరాదు
నీపట్టణముఁ జొర నితఁ డెంతవాఁడు
చలమున నేవీనిఁ జంపనోపుదును
[6]నరయఁ జెప్పితినీకు నసురాధినాథ !
నాకెదురెవ్వరు నరభోజనుండ !"

—: మైరావణుఁడు వృత్తాంతమెల్ల నరసి
హనుమంతునితో యుద్ధమునకుఁ గదలుట :—

అనిన మైరావణుండనగ బెట్టురికి

---

[1] వడిరావుపెట్టి. [2] మందసము. [3] తెల్ల. [4] సూదిముఖుండనువాడు. [5] కేంగుచున్నాండు.
[6] యరుగ.

కరమర్థి రాజులకడ కేఁగుదెంచి
వారట లేకున్న వగచి భీతిల్లి
చనుదెంచి మంత్రుల చావులఁజూచి
రయమునఁ బడియున్న రక్తాక్షుఁజూచి
దోర్దండిఁగానక తోరంపు[1] భీతి
నీలమేఘుఁడు లేని నేరమిఁజూచి
మనమునఁ[2] గుందుచు మైరావణుండు
కొలువుకూటమునకుఁ గొమరొప్పవచ్చి
చతురంగబలములఁ జయ్యనఁబిలిచి
దండనాయకులనుఁ దగఁజూచిపలికె
"వింటిరె! యొకకోతి వెఱువకవచ్చి
కడఁగి రక్తాక్షునిఖండించివైచి
మంత్రులఁబోరిగొని మలయుచున్నాఁడు
కాన నాకపిఁ జంపఁ గదలి పోవలయు 680
(ననుచునాజ్ఞాపించి యుండఁటుఁగూడి)
సంభ్రమంబునఁజని చయ్యనవచ్చి
వయ్యాళితోడను వాలుచున్నట్టి
హనుమంతుఁగనుఁగొని యార్చిపెల్లుబ్బి
శరవృష్టిఁగురియింపఁ జతురుఁడై నిలిచి
వాలముఖంబున వరబాణతతులఁ
దునియలుగాఁజేసి తుండించివైచి
రథములువిఱిచి సారథులనుగ్గాడి
కరిఁగరితో[3] వ్రేయ గగనంబుముట్టఁ
తురగంబుతోడను తురంగంబువేసి
రథములతోవైచి రథములఁజిదిపి

[1] కడకు. [2] గొందించి. [3] చెలంగరప్పించి.

రథసారథులఁబట్టి రణవీథిఁద్రుంచి
తనవాలమల్లార్చి దర్పించి మెఱసి
పదుల నూఱుల వేల బంధించి పట్టి
వసుమతితోడుత వరగర్వమెసఁగ
తరువులఁగొండలఁ దనరఁగఁ బెఱికి
దనుజసేనలమీఁదఁదగ వేసిచంపె

—: హనుమంతుఁడు శతజిహ్వాది రాక్షసులను మడియించుట :—

అంతట శతజిహ్వుఁడవలీలఁదాఁకఁ
జెలువొందఁగావాని జిహ్వలఁబెఱికి
కడునుగ్రముగ వానిఁ గడ జీవుఁజేసి 640
యంతటఁబోనీక యాగ్రహంబునను
వెలయరోషము విశ్వజిహ్వునిఁదాఁకె
వక్షంబుఁ బొడిచిన వాఁడంతయగ్గ
రోషించి మఱిఖడ్గరోమునిఁజంపెఁ
గాలదంష్ట్రునిఁబట్టి ఖండించివైచె
సేనాధిపతి నుగ్రసేనునిఁ జంపె
వజ్రకవచుని మెడఁ వాలమ్ముఁజుట్టి
వసుమతిపై వ్రేసి వానినిర్జించె
ముందట నానాదిముఖుఁ బొడఁగాంచి
" ఓరి! శూరుఁడనంచు నుదరిపడెదవు
మునుపునాచేతను ముక్కుఁబోనాడి
పిదపను లంకకుఁ బిఱికి నేనంటి
బ్రతిమాలికొనంటి పందననుకొంటి
[2]వెంతవేగంబున నిటవచ్చినావు "

ననుకొంటి. [2]యంతవేగుడవై తియిటవచ్చినావు.

అనివాలమున వాని నదరంట వ్రేసి
తాఁగాల వక్షంబుఁదన్ని చంపుటయుఁ
[1]బొరలి వాఁడంతట భూమిపైఁగూలె
మఱియును గలయట్టి మంత్రినందనులఁ
[2]బోరిఁగొని యాభంగిఁ బొలియించుటయును
[3]గోపించి గదఁబుచ్చుకొని దీర్ఘజిహ్వుఁ 650
డేపునఁ బఱతెంచి యనిలజుఁ దాఁకెఁ
దాఁకిన [4]నుగ్రుఁడై తరుచరేశ్వరుఁడు
[5]చేగదతో దీర్ఘజిహ్వునిఁ జంపె

—. హనుమంతుఁడు జంబుమాలిని జంపుట :—

నంతట కోపించి [6]యాగ్రహంబునను
నరదంబుఁదోలుక యాజంబుమాలి
• హనుమంతుఁ దాకిన నతిధీరుఁడగుచుఁ
[7]బవనుజుఁ డేసిన బాణంబులెల్ల
రయమునఁ బొడిచేసి రాక్షసుఁ దాఁకి
[8]తాలతమాలాది తరువులనపుడు
ఉరవడి దనుజుపై నొగి వేసివాని
[9]రథము ముక్కలుచేసి రాక్షసుఁబట్టి
పెనసి వాలముఁగట్టి బిట్టుదట్టించి
కొనకాలఁబట్టి యాక్రోశింపవాని
వడిఁద్రిప్పి నేలపై [10]వైవగా వాఁడు .

---

[1] పోసి నాడంతలో. [2] పోరియించుటి భంగి పొలియించుటయును. [3] కోపిచ్చిక వియించు కొనదీర్ఘ జింహు. [4] నచపలుండై. [5] చేతిగద సైచి. [6] అగ్ని మైయుండు. [7] పవనుజు నేసిన ........ంబులెల్ల. [8] తాలతమాల చన్పకతరువులాది. [9] చెక్కులు జేసి రాక్షసులబట్టి. [10] వైచి వైచుటయు.

తల వ్రయ్యలై పడి ధరణిపైఁగూలె

—: హనుమంతుఁడు అగ్నికేతుని బరిమార్చుట :—

వాఁడుఁగూలుటఁజూచి వడిఁగోపగించి
కెరలుచునాయగ్ని[1]కేతుఁడు మిగుల
దట్టించినొక భద్రదంతి పైనుండి
శరపరంపరలచేఁ జటులవేగమున
బలియుఁడై హనుమంతుపైఁగురియింప 660
నచలుఁడై హనుమంతుఁడా బాణతతుల
బలియుఁడై పొడిచేసి పటురౌద్రగతినిఁ
(ద్రోలియాయేనుఁగ తొండంబుఁబట్టి)
కుదియించి పడవైచెఁ గుంభిని మీఁదఁ
[2]గరినంతఁ దెగటార్చి కలుకురక్కసుని
తలపట్టిపడవైచి తన్ని చంపుటయుఁ

—: మారుతి మైరావణుల యుద్ధము :—

[3]గనిరావణుండంతఁ గడునుగ్రుఁడగుచుఁ
గటాకటా! యీకోతి కడఁగిరాక్షసులఁ
బొరియింపుచున్నాఁడు పోరిలోపలను
వీనిఁజంపకయున్న నిహితంబుగాదు
అనుచుఁగోపాగ్నులు నండందనిగుడ
ననలార్కసంకాశ మగురథంబెక్కి
వరదివ్యశస్త్రాస్త్రవైఖరితోడ
మైరావణుఁడు వచ్చి మారుతిఁదాఁకి
పరఁగంగఁదనతపోబలమునఁజేసి

---

1 కేతుండనువాడు. 2 కడిమిమై. 3 కనుగొని రావణు. 4 అనవార్క.

తెఱఁగొప్ప వడసిన దివ్యబాణముల
వర్షంబుగురియుక్రైవడి గుప్పెనపుడు
కలఁగక ధీరుఁడై కరువలిసుతుఁడు
కదలకయున్న యాకారంబుఁజూచి
[1]మైరావణుండంత మదిలోనఁదలఁచె 670
కాలాగ్నిరుద్రుఁడో కడఁగి యావీర
బద్రుఁడో యత్యుగ్రపావకవరుఁడో !
ప్రళయకాలమునాటి భైరవుండ[2]గునొ
[3]ఒనరనుపేంద్రునికుపమింపరాదు
(ఇతఁడువానరుఁడని యేనమ్మరాదు)
అనుచు రాక్షసవీరుఁడతివిస్మయమున
నరయుచు రౌద్రబాణములేయఁదొణఁగె
సరినాల్గుశరములు సాధించిమఱియు
వలనొప్పమారుతి వక్షంబువ్రేయ
నదితాఁకి వివశుఁడైనగచరేశ్వరుఁడు
అంతలోఁ[4]దెలివొంది యాతనిరథము
కోపించియవలీల కొనినొగల్వట్టి
యదరంటనేలతో [5]నణఁచెనాక్షణమె
విలుఁదునుకలుచేసి వెలయుసారథుని
నుక్కడంగఁజేసి నుగ్రతమెఱసి
మరియంత విరథుఁడై మైరావణుండు
గదఁబుచ్చుకొని వచ్చి కరువలిసుతుని
వదలకవ్రేసిన వనచరోత్తముఁడు
వడిద్రొగ్గి ధృతిదూలి వలనొప్పలేచి

---

[1] కలక మైరావణుదపోయదొణగి. [2] డొకాని. [3] వొనరకుపేంద్రుండనివుప. [4] సొదలిపి.
[5] .... మెనకాణ

గదరెండుతునుకలుగాచేసివిఱిచి 680
మెఱసివాలముచేత మెడఁజుట్టిపట్టి
భూమిపై నడఁచియుఁ బొరలించిదనుజు
తలప్రక్కలుగఁగొట్టి [1]దట్టించినిలిచె,
అంతమైరావణుండత్యుగ్రుఁడగుచుఁ
బఱతెంచియార్చినఁ బవననందనుఁడు
[2]రయమునవీఁడొక్క రాక్షసుండేమొ,
యనుచుఁగోపముతోడనాతనిఁదాఁకెఁ
బెనసియత్యుగ్రుఁడై పేర్చివాలమునఁ
దడయక ధీరుఁడై తఱచిరాఁదిగిచి
చలమున నిర్జించి చట్టలఁబాపి
సంధులు విఱిచియు శల్యముల్ పెఱికి
శల్యంబులొకవంక చట్టలొకవంక
సంధులుచట్టలు సరినాల్గుదిశలఁ
జీకాకుపడ వైచి చలఁగి యార్చుటయు
నంతలోపలవాఁడు అతిరభసమున
నార్చిముందటనిల్వ నావాయుసుతుఁడు
మాయావివీఁడని మదివిచారించి
"ఓరి! సహింపరా! ఉగ్రదానవుఁడ!
చెలువొంద నీమాయఁ [3]జీల్చివై చెదను
యేలగర్వించెదవింక నాయెదుట
బ్రతికిపోయితివేనిబంటు[4]నేననుచు."
రయమునఁబఱతెంచి రాక్షసుఁదాఁకెఁ
దాకినవాడంత దర్పించిపల్కె

---

[1]రక్షించి. [2]రయమునవిండొక్క రాక్షసుండొకొని [3]సంహారించెదను. [4]శూర నుచు.

" వనచరాధమ! నీవు వసుమతిమీఁదఁ
బంతంబులాడెదు పగవారియెదుట
హరిహరాదులకైన నజునకునైన
దిక్పాలకులకైన దేవేంద్రుకైనఁ
గాలాంతకులకైనఁ గదనరంగమున
నొనరంగఁ [1]బొసఁగదు యోరి! నన్నెదురఁ
గొనకొని ప్రేలెదు కోతినీవెంత
నీసత్వ మరయంగ నేనుంటిగాని
నీవెంతరా! ఓరి! నిమిషంబులోనఁ
గదిసిమ్రింగెద నిన్నుఁగరుణఁబోవిడిచి "
యనుచునుద్ధతితోడ హనుమంతుఁడాఁకి
నొడిసికైదువఁగొని వౌరబాయువెఱికి
ఝంకెఁఝుహుంకృతుల్ సరినెగుడుచుండ
నట్టహాసంబులు నార్పులు చెలఁగ
మరిహనుమంతుండు మైరావణుండు
రయమునబోరాడి రావణుఁబట్టి
దవడలఁ [2]దెగఁదన్ని దంతముల్ పెఱికి 700
కండలఁ దెగఁగోసి కఱకురక్కసుని
యముకలు ప్రేవులు యేవుతోఁజిదివి
మాంసరక్తంబుల మజ్జమేధముల
వడిచూర్ణములుఁ జేసి వసుమతిమీఁద
వెసజల్లి సరిలేని వేడుకతోడ
సమసెరావణుఁడని సంతోషమంది
మారుతసుతుఁడేఁగ మైరావణుండు
అప్పుడు చనుదెంచి యార్చిబిట్టెగసె,

---

[1]దలపోయవోరి. [2]వసనాటి. [3]చం........

కలకలనవ్వి యక్కరువలి సుతుఁడు
మదిలోన వెఱగంది మాయావిఁజూచి
" పోలుపొంద దురములో భుజబలంబునను
నెంతబల్లిదునైన [1]నెదిరింపవచ్చు
చచ్చియుఁజావఁడీ చపలరాక్షసుఁడు
యేమిసేయుదువీని నెట్లు[2]వధింతు."
అనియిట్లు జింతించు ననిలజుఁజూచి
యంతరంగంబున నతివ దోర్దండి
మారుతతనయుఁడు మైరావణుండు
నేకాంగులై పోరి యెంతయునలసి
నివ్వెఱఁగందుట నిజముగాఁజూచి
యచ్చటఁ జనుదెంచి యావాయుసుతునిఁ 710
గనుఁగొనిపలికె నాకాంతదోర్దండి
మారుతాత్మజ! వీనిమాయలఁబొంది
కాలదత్తునిసుతుఁ గదనరంగమునఁ
బోడఁజూప వలదని బుద్ధిగాఁజెప్పి
యేకాకియితనితో నేలపోరెదవు
చలమునవీఁడేల చచ్చు యుద్ధమున
మర్మంబుఁజెప్పితి మఱచితివీవు
(అనఁదనమనమున నతివనుబొగడి)
కరమర్థిఁదెలిసి యాకరువలిసుతుఁడు.
పోలుపొంద గిరిఁ[3]గూర్చి పోయేటియపుడు
మదిలోనఁజింతించి మారుతాత్మజుని
మతమునఁబలికె నామనుజభోజనుఁడు.

---

[1] రొంపపణవచ్చు. [2] ధరించు. [3] నాగిరిజా.

“ఓరి! వానర! నీవురయొంటి నా పురముఁ
జొచ్చితివెఱవక శూరత మెఱసి
యదియునుఁగాక నీ వాహవంబునను
(నాతోడఁ బోరుట యలవియే నీకు)
నీ రేడుజగములు యేపుమై నిలువ
హరిహరబ్రహ్మదులాదిగాఁగలఁగ
దేవతాదులనెల్ల ధీరతమెఱసి
బవరంబులోఁద్రొల్లి [1]పడఁద్రోసినాఁడ 720
వలనుప్ప ననుగెల్వ వనచర! నీకు
నలవియె తలపోయ నజ్ఞానబుద్ధి!
పోరఁజూచెదవింకఁ బొలియకఁబొమ్ము”
అనవుడు కోపించి యావాయుసుతుఁడు
మాయావిదెసఁజూచి మరికోపగించి
“ఓరి! పాపాత్ముడ! ఉపమింపరాని
తరుచరసేనాబ్ధిఁదగ మోసపుచ్చి
దశకంఠు పనుపున దానవ! నీవు
రాజులఁదెచ్చితి రభసంబు మెఱసి
అనుచు గర్వించెద వాత్మలోనీవు
(మొగతన మిదియౌనె మూర్ఖతఁ
చెలువొంద వానరసేనపై వచ్చి
తెఱఁగొప్ప రాజులఁ దెచ్చితివేని
మగవాఁడవనవచ్చు మహిలోననిన్ను
నెఱుఁగకుండఁగఁగుక్కయిలుఁ జొచ్చినట్లు
ఘనులనిక్కడఁదెచ్చి గర్వించినావు)

---

[1] పరపినవాఁడ.

నీపాటుఁజూడవు నీవుత్రుళ్లెదవు
ధరణిజఁ దెచ్చిన దశకంధరుండు
తలలుకుప్పలుగాఁగఁదాఁగూలుచుండుఁ
జలమున నినుఁజంప సమకట్టినాఁడు 730
(కూపానఁ) బడనుండఁ గొమరొప్పఁదనదు
వెనుకవానికిఁ జేయివెసనిచ్చినట్లు
గులమును [1]జెఱచిన కుత్సితుండతఁడు
చెలువొందవానికై చెడితివి నీవు
పొలుపొందరాజ్యంబుఁ బోనాడుకొంటి
నావానివలెవచ్చి నను మోసపుచ్చి
నీచావుఁగానక నీవునేఁడిట్లు
నీపాలవిధిదప్పె నేనేమిసేతు
[2]పొలుపొందగా నిన్నుఁ బొగడఁగొనకవు
మాయావి నీతోడ మాటలేమిటికి
నీలావుఁబరికింప నేనుంటిగాక
నీవెంతరావోరి! నినుఁ దోకఁగట్టి
పొలియింతు దివిజులు పొగడుచునుండ
నీమాయలన్నియు నీరుగావింతు ”
అనుచు వాయుజుఁడట్టహాసంబుఁజేసి
రొుడిసికైదువఁగొని యుగ్రతమెఱసి
మల్లయుద్ధంబున మదమెల్లనణఁచి
తనవాలముఖమున తాఁజుట్టిపట్టి
పెనచిరాఁదిగిచియుఁ బెంపొనరిఁచి
హుంకారరవమున నుర్వీకంపింపఁ 740

---

[1] చెడగోరినచ్చుతుండువాండు. [2] పొలుపొందగానిన్ను నీవె పొగడదవు.

[1]గరువలిసుతుఁడంతఁ గరమప్పళించె
నీభంగిఁదమలోన నిద్దఱుఁబెనఁగఁ
[2]బాయుచుఁగూడుచు బాహుదండముల
[3]వేయుచుఁబాయుచు విఱిగిపారుదురు
పిడికిళ్లఁబొడుతురు పృథుల వేగమున
నార్పులుబొబ్బలు నట్టహాసములు
ఘంకెలు హుంకృతుల్ సాహసంబులునుఁ
[4]దమలోన దిక్కులు తగులుకొన్నట్లు
గొండలలోరెండు కొండలుగ్రతను
దట్టించియుద్ధతిఁ దాఁకినయట్లు
పోరాడిరిద్దఱు భోలురాజేంద్ర!
వెలయమీకెఱుఁగింప విస్మయమయ్యె
నేమనిచెప్పుదు నినకులాధీశ!

—: హనుమంతుఁడు మైరావణుని సంహరించుట :—

హనుమంతుడంతలో నతిరౌద్రవృత్తి
మైరావణుఁబట్టి మానంబువుచ్చి
ముక్కులుఁజెవులును మొదలంటఁజిదిమి
తనరంగతనరోమతతులచేనతని
సంధిసంధికిఁగట్టి [5]సత్వంబుమెఱయ
మెయిఁగట్టి కాలితో మెదలరాకుండ
సర్వవాయువులును [6]సరగొప్పఁగట్టి 760
పరఁగ వింధ్యాచలప్రాంతంబునందు
నొకకాలువెట్టి వేరొకకాలనతని

[1] గాలితనూజుండు. [2] పాయుదురుకూడుదురు. [3] వేయుదురు పాయుదురు. [4] దిక్కులు తమలోనఢీకొన్నయట్లు. [5] బలముప్పెల్లబుచ్చి. [6] చదరకుండగగట్టి.

మెడఁద్రొక్కిపట్టి యామేరువునందు
వరబలంబునఁజేసి [1]వాడుస్వజీవ
[2]మక్కడఁదాఁచిన యాగుండుఁజూచి
దోర్దండి చెప్పిన తొట్టిమార్గమున
నెట్టని తుమ్మెదలేదు వాకిళ్లు
జొచ్చుట [3]నొక్కటఁ జోద్యంబుఁజూచి
యాతుమ్మెదలఁబట్టి యనయనొక్కటనుఁ
బట్టిచంపకవీని ప్రాణముల్ వోవు
పట్టిననొండొంటి పారిపోయెడిని
యేభంగిఁబట్టుదు (నేమిసేయుదును)
[4]అనియిట్లు జింతించి యనిలజుఁడంత
[5]గుండుతో (డనువానిగుల్లంగఁజఱచె)
(చఱచినం) తటవాఁడు చయ్యనచటఁ
గదలక మెదలక కడచినయట్లు
బలువిడి ధరఁగూలి ప్రాణముల్ విడిచె.
పిడుగు [6]వడినఁగూలు పృథివీధరంబు
పగిది వసుమతిపైఁబడియె రావణుఁడు
అప్పుడు రణభూమి యతిభీకరమున 760
మోములుశిరములు ముక్కడొక్కలును
దుండంబులుఁజెవులు తునియలై పడ్డ
కరులు తురగములు ఘనముగా మడియఁ
గొఱప్రాణములతోడఁ గూడినభటులు
మేటిరాక్షసులును మిన్నులుముట్ట
నాడెదు నట్టలు నడలు భూతములు

---

[1] అతండుతనజీవ. [2] యందుతోడాఁచినాగుండుచూచి. [3] రొక్కట సాధ్యంబు.
[4] తనమనమున చింతించి మారుతియంత. [5] గుండ్లతోనెమనకూట...... [6] వేశిన.

పాడెదు ఢాకినుల్ భైరవంబెసఁగ
మాంసరక్తములకు మఱిగి భూతములు
పారుచుఁ దారుచు [1]భ్రమసి యాడుచును
నేపార రుధిరంపుటేటి లోపలను.
నీదాఁడుచును మదికిచ్ఛలంబైన
[2]హాహారవంబుల నానందతతుల
నంజుళ్లు మెక్కుచు నావాయునుతునిఁ
బొగడుచుండెను మహాభూతసంఘములు
[3]పరగనత్తలకునుఁ బడుచుకోడండ్లు
వండఁదఱిగినరీతి వడినుండెరణము.
అప్పుడానందించిరఖిలదేవతలు,
పరఁగంగ హనుమంతుపైఁ బుష్పవృష్టి
నరుదుగాఁ గురియించి రాకాశమునను
దీవించిరప్పుడు దేవతలెల్లఁ                                   770
బాతాళవాసులుఁ బ్రస్తుతిఁజేయ
వెలయంగనహిరాజు వేయివిధముల
నరుదుగాఁబొగడె నాహనుమంతులావు.

—: మాతంగి విలపించుట :—

అంతరావణుపత్ని యడలుచువచ్చి
తనపతి మీఁడను దామొదుకొనుచుఁ
" బోయితేరావణ ! భువనైకవీర !
చెప్పిన నామాట చెవిసోకనీక
పొలుపొంద రాజ్యంబుఁ బోనాడుకొంటి

---

[1] పరిణమింపుచును. [2] హాహాసాలార వ్యగములానందతతుల. [3] పరంగనంతలకు భాగసంబునకు.

నీపాలివిధి తప్ప నే నేమి సేతుఁ
బరఁగ రాఘవుతోడి పగవలదంటిఁ
బవనజుండెట్టిన బ్రతుకనీడంటిఁ
(గని తెచ్చి) నీచావుఁగానలేనైతి
నీవనియిట్లుండ నేమనవచ్చు
నెక్కడిదశకంఠుఁ డెక్కడిచెలిమి
మదిమదినుండి నీమదమార్చుకొంటి
తనకునెక్కడిదిక్కు దానవాధీశ !"
(అని వేయి) భంగులనడలుచుండఁగను
సుతునిఁదోడ్కొనివచ్చె (సుదతిదోర్దండి)
(పరఁగంగ) హనుమంతు పదములకెఱఁగి
సురకంటకునిచావుఁ జూచి శోకించి 780
మాతంగినూరార్చి మైరావణునకు
నగ్నిసంస్కారంబులమరంగఁజేసి
ముప్వరుహనుమంతు [1]ముందఱనిలువ

—: హనుమంతుఁడు మాతంగి నూరార్చి నీలమేఘ రూపవతులకుఁ బెండ్లి చేయించి పాతాళలంకకుఁ బట్టంబుఁ గట్టుట :—

మారుతసుతుఁడంత మాతంగిఁజూచి
" కరమర్థి శ్రీరాముకారణంబునను
మదమత్తుఁడైవచ్చె మైరావణుండు
కరమర్థి నాతఁడు కనియెస్వర్గంబు
నటుగాన వెఱవకుమతివరో ! నీవు
నీదు మేనల్లుఁడు నిజధర్మపరుఁడు

---

ముప్వరు. గాం చెద. [1]ఆకు.........రో నీవు.

విష్ణుభక్తుఁడు మహావినయపరుండు
అతనికి నీకూఁతు నారూపవతినిఁ
(బెంపు మీరఁగనిచ్చి పెండ్లిగావించి)
చెలువొందగాబంధు జనులునుఁగూడఁ
బొలుపొంద సౌభాగ్య భోగసంపదల
ననుభవింపుమగాక యడలకు''మనుచు
మాతంగిశోకంబు మాన్పియంతటను
మంత్రులహితులను మరిపురోహితులఁ
బరఁగంగఁబిలిపించి పవనసందనుఁడు
నీలమేఘునిఁదెచ్చి నిజ[1]సదనమున
నారూపవతికన్య ననురాగముననుఁ 790
బొలుపొందనతనికిఁ బెండ్లిసేయించి
పాతాళలంకకుఁ బటంబుఁగట్టి
శ్రీరామనామము చెల్లునందాఁక
చెలువొందరాజ్యంబు సేయుమీవనుచుఁ
బొందుగానతనికి బుద్ధులుఁజెప్పి
తెలఁగొవ్వ బహువిధ్ధదీవెనలిచ్చి
ధర్మంబు దయయును దగవునుహితవు
మరినీవుతప్పకు మంత్రులబుద్ధి
నతిభక్తి[2]వినుమంచు నతనికిఁజెప్పి
మానంబుఁగాచిన మగువదోర్దండిఁ
బిలిపించినతిభక్తిఁ బ్రియములుఁబలికె
"వరదుగానీ[4]తోన నాడినమాటఁ
జెల్లించితిని''యని చెప్పియాతుఁ డా...

[1]శోభనమున. [2]భక్తి......... [3]పిలిచియు. [4]నీతోన.........

—: హనుమంతుఁడు రామలక్ష్మణ సహితుఁడై మత్స్యవల్లభుని సాహాయ్యమునఁగోలనుదాఁటి వానరసేనలఁగలియుట :—

వారలవీడ్కొలిపి వాయునందనుఁడు
కరమర్థిరాజుల కడకేఁగుదెంచి
మహినొప్పు(నాయుక్క) మందసంబూడ్చి
పొలుపొంద నాదివ్య (పురుషులఁ) జూచి
మెల్ల నేవారలు మేల్కొనకుండఁ
దనదుహస్తంబునఁ దాఁగొనివచ్చి
(మారుతతనయుండు మత్స్యవల్లభుని)
(తలచెనంతటవాఁడు తడయకవచ్చి) 800
ముదమొప్పఁ దనతండ్రి ముందటనిలిచి
సరగరాజులజూచి సంతోషమంది
రాజులఁదండ్రిని రయమున మెఱసి
వీపుపై నిడుకొని విపులసత్వమునఁ
గోమరొప్పగా[1]వారిఁ గోలనుదాటించి
ధరణీశులనుదించి దండంబుఁబెట్టి
హనుమంతునకుమ్రొక్కి హస్తముల్ మొగిచి
తండ్రి! యెక్కడనైనఁ దరియైనచోటఁ
దలఁచిన వచ్చెద దనరంగ వేగ
నని చెప్పిమగుడ వాఁడాత్రోవఁజనియె
వాయునందనుడంత వసుధీశవరుల
వలనొప్పఁగొనివచ్చి వనచరసేనఁ
గలియంగవచ్చినఁ గపివరులెల్ల
సుగ్రీవుఁడాదిగా సారదివానరులు

[1] వించిగోఱువులోపలను.

నేపారననిలజు కెదురుగావచ్చి
పదివేలభంగులఁ బ్రస్తుతిఁజేసి
కొనిపోయిమిమ్మునుఁ గుశశయ్యమీఁద
నునుపసంతటిలోన యుదయించెనినుఁడు,
అనియిట్లు మునివరుఁడనిలజుమహిమఁ 810

—: శ్రీరామచంద్రుఁడు హనుమంతునిఁ బొగడుట :—

తెలుపొప్ప వినుపింప శ్రీరామచంద్రుఁ
డానందమునుఁబొంది యామునీశ్వరుని
పాదపద్మములకు భక్తితో మ్రొక్కి
సంయమీశ్వరుఁజూచి సంతోషమంది
"నాఁడునిద్రింపుచు నాలోననిట్టి
భావంబుతోఁ జగా భయమందిచూచి
(గుహఁబోలు) చోటికి కొనిపోయి నట్లు
...........................
...........................
...........................
మీరుచెప్పంగ సమీరనందనుని
బంతంబువినఁగల్గె ఫలమయ్యెనాకు."
అనిహనూమంతుని నతివేడ్కఁజూచి
[2]కరమునసుండెడు ఘననవరత్న
హారంబులన్నియు నరయఁగనిచ్చి
బహురత్నచయమగు పథకంబుఁబెట్టి
చెలఁగి కిరీటంబు శిరసుననుంచి

[1]మీరానతి ప్రసా.....నుంతు, [2]కరకర నుండెడుకడు నవరత్న.

మన్నించి కౌఁగిట మానుగాఁ జేర్చి
వాయుతనూజుని వలనొప్పఁజూచి
" తెలఁగొప్ప నీలావు తెంపుగాఁ జేసి
దానవాంబుధి [1]దాఁటి ధరణిజఁ గొనుచుఁ
జెలువొప్ప రాజ్యంబు సేయంగఁ గలిగెఁ 820
గ్రమమొప్ప సిద్ధించుఁ గ్రతు కోటిఫలము
అటుగాన నీవు నాయర్ధాసనమున
గూర్చుండు [2]మనిలజ! కోర్కె దీపింప " తెలుగు విశ్వవిద్యా
అనిపల్కి రఘురాముఁ డా మునికనియె
" మునినాథ! వానరముఖ్యుండ నేనుఁ
బొత్తునఁ గూడువక పొసఁగదు మనసు "
అనవ్రండు మునినాథుఁ డతిసంతసమున
శ్రీరాఘవేశ్వర! శ్రీరామచంద్ర!
[3]వారిధిగాంభీర్య! వర మేరుధైర్య!
పాతకారులు యెల్ల భస్మమైపోవుఁ
దలఁచినంతట వారితలఁపు సిద్ధించు
మీకృపఁ బొందె సమీరనందనుఁడు
యాతనిఁ దలఁచిన నెల్ల కార్యములుఁ
బడయుదు రటుగాన భానుకులేశ!
అటుగాన నీవిట్లు.........
.........భంగుల నమ్ము నీశ్వరుఁడు,
పరఁగ శ్రీరామునిఁ బ్రస్తుతి సేయ
మొక్కి హనుమంతుండు మునివరు కపుడు
సద్భక్తి............ గాఁగ మెఱఁగి

---

[1] గడచి. [2] మనవుండు. వరనిధి గాంభీర్య మేరుధైర్య. [4] మీకృపబడసిన మిహిరనందనుండు.

మోరకంకణములుమా..........,
.......... పట్టుపచ్చడముఁ 830
గట్టంగ నిచ్చినకడు భక్తితోడ
ధనముదాన్యంబులు.............,



# తప్పొప్పులపట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 12 | వేఁగ | వేగ |
| 4 | 2 | రంజిల్లపజ్జను | రంజిల్లఁబజ్జను |
| ,, | 3 | మొదలుగాపరమహర్షమున | మొదలుగాఁబరమహర్షమున |
| ,, | 15 | రంజిల్లుచున్న | రంజిల్లుచున్న |
| ,, | 24 | జెలగి | జెలఁగి |
| 5 | 15 | వీరులతోఁడ | వీరులతోడ |
| ,, | 21 | సుగ్రీవుడాఁదిగా | సుగ్రీవుఁడాదిగా |
| ,, | 23 | కరముర్ధి | కరమర్ధి |
| 7 | 3 | గరముర్ధి | గరమర్ధి |
| ,, | 4 | వెరగొప్ప | వెరఁగొప్ప |
| ,, | 6 | దరుచర్లతోఁడ | దరుచర్లతోడ |
| ,, | 7 | జెలయు | వెలయు |
| ,, | 21 | చదురుఁడై | చతురుఁడై |
| 8 | 5 | బ్రహ్మాస్త్రనిహతికిఁబద్ధుఁడై | బ్రహ్మాస్త్రనిహతికిబద్ధుఁడై |
| 9 | 6 | వేదనబొంది | వేదనఁబొంది |
| 10 | 6 | జంచలింపకలావు | జంగలించుచులావు |
| ,, | 21 | తూఁతెరంగంతయు | తూఁతెటంగంతయు |
| ,, | 8 | వసిష్ఠుడు | వసిష్ఠుఁడు |
| 12 | 6 | సిద్ధించు | సిద్ధించుఁ |
| ,, | 7 | పరఁగ | బరఁగ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 15 | యతనికౌఁగిట | యతనిఁగౌఁగిట |
| 14 | 11 | నెఱఁగి | నెఱిఁగి |
| ,, | 16 | బగవారిఁగూఁడె | బగవారిఁగూడె |
| 15 | 3 | మెరుఁగవే | మెఱుఁగవే |
| ,, | 7 | నెఱఁగన | నెఱిఁగిన |
| ,, | 17 | పరగంగ | పరఁగంగ |
| ,, | 20 | ధనుజాధినాథ ! | దనుజాధినాథ ! |
| 16 | 2 | గోరెఁడువాఁడు | గోరెడువాఁడు |
| ,, | 11 | బరగంగ | బరఁగంగ |
| ,, | 17 | నీవార్తపుత్తేరనచట | నీవార్తఁబుత్తేరనచట |
| 23 | 14 | కొమరొప్ప | కెఱఁగొప్ప |
| 24 | 14 | పగవానిపొగడెడు | పగవానిఁబొగడెడు |
| 25 | 11 | అనగ | అనఁగ |
| ,, | 21 | దాల్చి | తాల్చి |
| ,, | 23 | గానననిప్పుడు | గాననిప్పుడు |
| 26 | 7 | నెఱుయంగ | నెఱయంగ |
| ,, | 20 | ముఱ్కవిరిగిన | ముక్కువిఱిగిన |
| 27 | 3 | యిదియేమి | నిదియేమి |
| ,, | 14 | తాకి | తాఁకి |
| 28 | 13 | మైరాపణుఁడు | మైరావణుఁడు |
| ,, | 17 | శరణువేడిన | శరణువేఁడిన |
| ,, | 18 | గావఁగనేరదితడు | గావఁగనేరదితఁడు |
| ,, | 20 | యాత్మభంధుఁడవు | యాత్మబంధుఁడవు |
| 29 | 23 | బరగంగఁజెప్పి | బరఁగంగఁజెప్పి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 30 | 7 | యొక్లెఱుఁగవచ్చు | యొక్లెఱుఁగవచ్చుఁ |
| ,, | 8 | కానిమాటలు | గానిమాటలు |
| 31 | 10 | బరగనిద్దఅనుఁ | బరఁగనిద్దఅనుఁ |
| 32 | 15 | మఱసించి | మఱపించి |
| 33 | 5 | ్రనాగ్రహంబొంవ | నాగ్రహంబొంద |
| ,, | 6 | సుగ్రీవుఁడు | సుగ్రీవుఁడు |
| 35 | 11 | నన్నసు | నన్నను |
| 40 | 12 | చెదఱకపోవ | ?చెదఱకపోవ |
| ,, | 20 | వాయునందనుడంత | వాయునందనుఁడంత |
| 41 | 16 | పృత్తాంతమెల్ల | వృత్తాంతమెల్ల |
| 46 | 9 | పురవిధి | పురవీథి |
| 47 | 22 | అంజనేయుఁడు | ఆంజనేయుఁడు |
| ,, | 23 | పృత్తాంతమును | వృత్తాంతమును |
| ,, | 24 | అనియిట్టుపలుకుచు | అనియిట్లుబలుకుచు |
| 51 | 9 | మైరావణేశు | మైరావణేశుఁ |
| 54 | 9 | సూదిముఖండు | సూదిముఖుండు |
| 57 | 6 | ధీరుడై | ధీరుఁడై |
| 59 | 16 | సేనాథపతి | సేనాధిపతి |
| ,, | 17 | వజ్రకవచుని మెడక | వజ్రకవచు మెడక |
| 60 | 13 | దాకిన | దాఁకిన |
| 61 | 15 | గదనుఁగ్రుడగుచుఁ | గదనుగ్రుఁడగుచు |
| 62 | 7 | బద్రుఁడో | భద్రుఁడో |
| ,, | 17 | యువలీలకొనినొగల్ | యువలీలఁగొననొగల్ |
| 63 | 1 | తునుకలుగాచేసి | తునుకలుగాఁజేసి |

| | | తప్పు. | |
|---|---|---|---|
| ,, | 5 | మైరాపణుండత్యుగ్రుఁడగుచు | మైరావణుండత్యుగ్రుఁడగుచు |
| ,, | 7 | వీడొక్క | వీఁడొక్క |
| ,, | 15 | చలఁగి | చెలఁగి |
| ,, | 24 | దాకినవాడంత | ద్రాఁకినవాఁడంత |
| 64 | 16 | రయమునబోరాడి | రయమునఁబోరాడి |
| ,, | 21 | వసుమతిమీాద | వసుమతిమీాఁద |
| 65 | 2 | వెఱగంది | వెఱఁగంది |
| ,, | 10 | మె తయు | యెంతయు |
| 66 | 19 | మూాగ్ఖతఁ | మూాగ్ఖతగాని |
| 67 | 23 | బెంపొనరిఁచి | బెంపొనరించి |
| 68 | 12 | మీాకెఱుఁగి ప | మీాకెఱిఁగింప |
| 70 | 9 | పరగ | పరఁగ |
| 71 | 21 | నాతఁడు | నాతఁడు |
| ,, | 22 | వెఱవకు | వెఱవకు |
| 72 | 8 | పుర్రోహితులఁ | పురోహితులఁ |
| 73 | 21 | వ్వాయునందనుడంత | వాయునందనుఁడంత |
| ,, | 24 | సుగ్రీవుడాఁదిగా | సుగ్రీవుఁడాదిగా |
| 74 | 12 | భ్భావంబు | భావంబు |
| ,, | 13 | చోటికికొనిపోయినట్లు | చోటికిఁగొనిపోయినట్లు |
| 76 | 3 | నిచ్చినకడు | నిచ్చినఁగడు |